శ్రీః

# ఆత్మాష్టకమ్
# శ్రీకృష్ణానద్యష్టకమ్
# శ్రీహయగ్రీవనవరత్నస్తుతిః
# శ్రీ సాలగ్రామ నృసింహాష్టకమ్
# శ్రీవేదాద్రి యోగానన్ద నృసింహాష్టకమ్


## శ్రీ బెల్లంకొండ రామరాయకవి

(1875-1914)

(ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ)

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,
తిమ్మసముద్రము





ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి

తెనాలి-522 201

వెల : రూ. 20/-

శ్రీః

# ఆత్మాష్టకమ్
# శ్రీకృష్ణానద్యష్టకమ్
# శ్రీహయగ్రీవనవరత్నస్తుతిః
# శ్రీ సాలగ్రామ నృసింహాష్టకమ్
# శ్రీవేదాద్రి యోగానన్ద నృసింహాష్టకమ్


**శ్రీ చెల్లరకొండ రామరాయకవి**

**(1875-1914)**

(ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ)

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,

తిమ్మసముద్రము





ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి

తెనాలి-522 201

శ్రీ బెల్లంకొండ రామరాయకవి (1875-1914)
పంచ లఘుకృతులు (వ్యాఖ్యతో)

**ఆత్మాష్టకమ్**
**శ్రీకృష్ణానద్యష్టకమ్**
**శ్రీహయగ్రీవనవరత్నస్తుతిః**
**శ్రీ సాలగ్రామ నృసింహాష్టకమ్**
**శ్రీవేదాద్రి యోగానంద నృసింహాష్టకమ్**

ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య వివరణ :
**మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి**

ప్రథమ ముద్రణ:- చిత్రభాను 27-12-2002
(శ్రీ బెల్లంకొండ రామరాయకవి జయంతి)

ప్రతులు : 1000
పేజీలు : 64
వెల రూ. : 20-00


4-103, ILTD Colony Extn., Kothapet, **CHIRALA** - 523 157.
Phone : 08594-34054.

ప్రతులకు :
1. సాధన గ్రంథమండలి, తెనాలి-522 201
2. బెల్లంకొండరామకోటేశ్వరరావు, పమిడిపాడు (వయా) నర్సరావుపేట, గుంటూరు జిల్లా



DTP by
VIKRAM GRAPHICS
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 37658

Printed at :
**KAMALA ART PRINTERS,**
Near Chinaravuru Park,
TENALI.
Ph : 225072, 282972

శ్రీః

## శ్రీహయగ్రీవాయనమః



విద్యామూర్త్తి మఖణ్డ చన్ద్రవలయ శ్వేతారవిన్దస్థితమ్
హృద్యాభం స్ఫటికాద్రినిర్మలతనుం విద్యోతమానం శ్రియా।
వామాజ్క స్థిత వల్లభాం ప్రతి సదా వ్యాఖ్యాన్త మామ్నాయ వా-
గర్థా వాదిమపూరుషం హయముఖం ధ్యాయామి హంసాత్మకమ్॥

# మండలి మాట

శ్రీహయగ్రీవాయనమః

**జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥**

గుంటూరు జిల్లా, నర్సరావుపేట మండలములోని పమిడిపాడు గ్రామములో జన్మించిన శ్రీ బెల్లంకొండ రామరాయకవి శ్రీ హయగ్రీవోపాసనతో ప్రత్యక్షఫలాన్ని పొందిన అపర హయగ్రీవుడు. గైర్వాణిలో గద్య పద్యాత్మకముగ శతాధిక గ్రంథములను వెలువరించి ఆధ్యాత్మిక ప్రపంచములో దేదీప్య మానముగా ప్రకాశించిన మహనీయుడు.

ఈ కవి విశ్వాత్మ భావనతో కఠోరతపస్సు నొనరించి అద్వితీయ విద్వాంసుడై భగవద్గీతకు **'భాష్యార్క ప్రకాశిక'**ను, ద్వాదశోపనిషత్తులకు **'వేదాన్తముక్తావళి'**ని, మతఖణ్డనలపై **శంకరాశాంకరభాష్య విమర్శను** వ్యాకరణ సంబంధముగా **శరద్రాత్రిని**, బ్రహ్మ సూత్రాల సారమైన మొదటి నాలుగు సూత్రాలకు **శారీరకచతుస్సూత్రిని**, అద్వైతసిద్ధాంత గ్రంథములైన **'అద్వైత విజయః, అద్వైతామృతమ్, వేదాన్త నిశ్చయః, సిద్ధాన్త సింధుః,** మరియు **శ్రీహయగ్రీవసహస్రనామస్తోత్రమ్, విష్ణుసహస్రనామ స్తోత్రమ్, భాగవతచంపూః కందర్పదర్పవిలాసభాణః'** మొదలగు గ్రంథాలను అందించి అపర శంకరుడైనాడు. ఈ మహనీయుని రచనలను మండలి తరపున వెలువరించాలన్నది ఎన్నో యేళ్ళ తపన. నేటి ఈ పంచలఘుకృతుల ముద్రణ నన్ను ఆనంద డోలికలలో ముంచెత్తుతున్నది. ఈ పంచలఘుకృతులకు అర్థతాత్పర్య వివరణలను అందించిన చి॥ శ్రీ మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి శుభాశీస్సులు.

ఇట్లు
**బులుసు సూర్యప్రకాశ శాస్త్రి**
సాధన గ్రంథ మండలి వ్యవస్థాపకుడు

# శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ బెల్లంకొండ రామరాయకవిగారి కుటుంబ చరిత్ర

రామరాయకవిగారు జీవించియుండగా 1913వ సం॥ నవంబరు నెల 5వ తేదీన బెల్లంకొండ వల్లభరావుగారి ద్వితీయ పుత్రుడు నారాయణరావును దత్తుగా స్వీకరించి యావదాస్తికి వీలునామా వ్రాయించి జ్ఞాతులు, పెద్దలు అందరి సంతకములు గూడా చేయించినట్లు సప్రమాణముగ జరిగిన విషయము. కాని, కవిగారి భార్య ఆదిలక్ష్మమ్మ గారికి తన మేనల్లుడైన ముత్తురాజు పార్థసారథిని దత్తు తీసుకొనవలయునని ఉద్దేశ్యము కలిగియున్నది. అప్పుడు కవిగారు ఇది శాస్త్రసమ్మతము కాదని తెల్పి జ్ఞాతియైన నారాయణరావును దత్తు తీసుకొని సదరు దత్తు కుమారునితో బాటు ఆమె మేనల్లుడైన పార్థసారథికి కూడా ఆస్తి వ్రాయించినారు. అప్పుడు కవిగారు ఆయన భార్యతో నీకీ నారాయణుడే దిక్కు అని పరమపదించినారు. దరిమిలా ఆమె పోషణ, ఉపచారములన్నియు నారాయణరావే చేసినారు. కవిగారు దత్తుతీసుకొనునప్పటికి నారాయణరావు వయస్సు 3 సం॥. సదరు నారాయణరావు జన్మించినప్పుడు జాతకర్మ నామకరణాదులు రామారావు గారే దగ్గర ఉండి జరిపించినారు. కవిగారు స్వర్గస్థులైన దరిమిలా కవితా సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి  స్వప్నమున సాక్షాత్కరించి గ్రంథముల ముద్రణకు ప్రేరేపించిరి. తరువాత తరచు శాస్త్రిగారు ఇచ్చటికి వచ్చుచూ నారాయణరావుగారి మంచిచెడ్డలు చూచుచుండిరి.

**కవిగారి జీవితములో ముఖ్యసంఘటన-**

కవిగారి వంశగురువులు, శ్రీవైష్ణవ పీఠస్థులు తిరుపతి నుండి ప్రతివాది భయంకర రంగాచార్యులుగారు వచ్చుచుండెడివారు. వారు వచ్చునపుడు ఈ కవిగారు తగిన ఆతిథ్యమిచ్చి గౌరవించి, ఉండుటకు వసతి కల్పించుచుండెడివారు. వారు ఉపవీతులైన వారికి తప్తచక్రాంకనములిచ్చి విశిష్టాద్వైత సంప్రదాయానుసారము మంత్రోపదేశము చేసెడివారు. వారు మంత్రోపదేశము పొందుమని కవిగారిని కూడా కోరిరి. అప్పుడు కవిగారు ఉపనయనసంస్కారములులేని శూద్రులకేగాని మాకు చక్రాంకితములు వేయుట శాస్త్రసమ్మతము గాదనిరి. మంత్రమును మాత్రమే స్వీకరింతుము. మిగిలిన కలాపము అక్కరలేదనిరి. మరునాడు కవిగారు శేషబావి వద్ద అనుష్ఠానము, నిత్యకృత్యములు ముగించుకొని వచ్చుసరికి సుమారు ఉదయం 8 గం॥ ప్రాంత సమయమైనది. అప్పుడు గురువుగారు తాగి పారవేసిన ఎంగిలి పరమాన్నపు దొన్నెలు వగైరాలు చూచుట తటస్థించినది. ఇప్పటికి వీరికింకను దేవతార్చన, అనుష్ఠానములు

కాలేదు. అప్పుడే వీరు భుజించినారేయని తలచి–"సకంచుక యతిం దృష్ట్వా అకంచుక నారీం దృష్ట్వా, లింగినం చక్రినం దృష్ట్వా సచేలం స్నానమాచరేత్"–అని అనిరి. అప్పుడు గురువుగారు మమ్మల్ని ఆక్షేపిస్తున్నావా అనగా శాస్త్రీయప్రామాణికముగా నిరూపించిన యెడల మేము ఆక్షేపించము అనిరి. వారు దానితో తిరుగు ప్రయాణమైరి.

తరువాత తప్తచక్రాంకన ఖండనము, శూద్రధర్మదర్పణము వెలువరించిరి. పిమ్మట యాదృచ్ఛికముగా శ్రీ భగవద్గీతాశాఙ్కర భాష్యము, వేదాన్త పంచదశి అధ్యయనము చేయుటతో, విశిష్టాద్వైత భావన నుండి మరలి అద్వైతవిజయము, శంకరాశంకరభాష్య విమర్శ, భాష్యార్క ప్రకాశిక మొ॥ ఎన్నో అద్వైత గ్రంథములు వ్రాసి అద్వైత మార్గమును అవలంబించిరి.

**జననం-** యువ నామ సం॥ మాఘబహుళ అమావాస్య సోమవారం కర్కాటక లగ్నం తేది. 27-12-1875. బ్రహ్మైక్యం - ప్రమాదీచనామ *సం॥* కార్తీక శుద్ధ నవమి *27-10-1914.*

కుటుంబ పరిస్థితి - 'బ్రాహ్మణో భోజనప్రియః' అన్నట్లు కవిగారి వల్ల సంక్రమించిన ఆస్తి భుక్తమైపోవుచుండగా నారాయణరావుగారు బ్రహ్మచర్యమవలంబించియుండిరి. అప్పుడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రములోని ఆర్కాటు జిల్లా గుడియాట్టం తాలూకా తలయారింబట్టు, తిరుమణి, ఉణ్ణామన సముద్రం - అను మూడు గ్రామములకు అగ్రహారీకులైన వెంకట్రామశర్మగారు తమ కుమార్తెను మంచి యినాందార్లకు ఇవ్వవలెనను తలంపుతో సకుటుంబముగా పమిడిపాడు వచ్చి (నర్సరావుపేట దగ్గర) ఇక్కడ ఆస్తి లేదని తెలుసుకొని తిరిగి వెళ్ళే ప్రయత్నం చేయుచుండగా కవిగారి గ్రంథ సంపాదకులైన కవితా సుబ్రహ్మణ్యశాస్త్రి దంపతులు మరియు గ్రామస్తులందరు వారికి నచ్చచెప్పి ప్రోత్సహించి పునర్వివాహితుని చేసిరి. నారాయణరావు విజయలక్ష్మమ్మ దంపతులకు 1. రామకోటేశ్వరరావు, 2.సీతాలక్ష్మి, 3. శారద, 4.భవాని, 5.రామమోహనరావు, 6.శ్రీనివాసరావు అను సంతతి కలిగిరి. నారాయణరావు గారు 1971 జనవరి 25న స్వర్గస్థులైరి.

కవిగారి దత్తుకుమారులు స్వర్గస్థులైన తర్వాత పెద్దల ఆస్తి అంతయు జీర్ణముకాగా తిండికి ఇబ్బంది పడుతూ ఆడపిల్లలకు పెండ్లిచేయలేని పరిస్థితి ఉండగా నారాయణరావు గారి తమ్ముడు నరహరిరావుగారు పెద్దకుమార్తె సీతాలక్ష్మికి మేనరిక వివాహము జరిపించిరి. ప్రస్తుతము వారు రాయవేలూరులో ఉన్నారు. కంచికామకోటి పీఠంవారు మిగిలిన ఇద్దరు

బాలికల వివాహమునకు తగిన ద్రవ్యసహాయము చేసిరి. శారద ప్రస్తుతం మైసూరులో ఉన్నారు. భవాని గుంటూరులో ఉన్నారు.రెండవ కుమారుడు మోహనరావు 10వ తరగతి వరకు చదివి నర్సరావుపేట దగ్గరలోని చీమలమర్రి గ్రామ పోస్టుమాస్టరు. శ్రీనివాసరావు విజయవాడ శివరామకృష్ణ క్షేత్రంలో కంచి పీఠాధిపతులు జయేంద్రస్వామి వారి సమక్షములో ఉపనయనం పొంది శ్రీమన్నారాయణ చినజీయ్యర్ స్వామి (సీతానగరం) వారి వేదపాఠశాలలో చేరియుండగా కొద్దిరోజులకు అక్కడ తప్తచక్రాంకితములు పొందవలెనని ఆంక్ష విధించిరి. అపుడు తాతగారి సిద్ధాంతానికిది వ్యతిరేకమైన చర్య అని తలచి విజయవాడలోని పెద్దలు, బ్రాహ్మణసంఘం వారు, గుడిమెళ్ళ కామేశ్వరరావు గారి ప్రోత్సాహముతో, బ్రాహ్మణసంఘము ద్రవ్యసహాయంతో శృంగేరికి పంపిరి. అక్కడ పీఠాధిపతులగు శ్రీ భారతీతీర్థస్వామివారు ఆప్యాయతతో ఋగ్వేదక్రమాంతం చెప్పించి కాలడిలోని వేదాంత పాఠశాలలో వేదాంతవిద్వత్తు వరకు చదివించిరి. తర్వాత శృంగేరీ వేదపాఠశాలలో ఉపాధ్యాయ వృత్తిలో ఉండగా టి.టి.డి వేద పాఠశాల మాజీ ప్రిన్సిపాల్, కంచి పరమాచార్యగారి శిష్యులు శ్రీ అనంతనారాయణ సోమయాజిగారు వారి కుమార్తెనిచ్చి వివాహము జరిపించి శ్రీనివాసరావు చేత సోమయాగము, నిత్యాగ్నిహోత్రదీక్షను చేయించి ప్రస్తుతం లాల్‌గుడిలోని వేదపాఠశాలలో ఉద్యోగమిప్పించిరి. 1993 సం॥ మే నెల 25వ తేదిన గృహస్థుడనైతిని. నిరాడంబర వివాహము. తండ్రిగారి వలన సంక్రమించిన దస్తావేజులేఖరి వృత్తి, పొలం కౌలతలు మొ॥ లౌకిక వృత్తితో కాలము గడుపుచున్నాను. తగిన ఆదాయం లేకపోయినప్పటికీ మిగతా పనులు చేయుటకు తగిన ప్రోత్సహము లేక కాలము గడుపుచున్నాను. నేను, మా సోదర సోదరీమణులు సంతానవంతులమైయున్నాము. మా తల్లిగారు నా వద్దనే ఉన్నారు. అందరు క్షేమము.

కాని కుటుంబ పోషణకు తగిన జీవనాధారములేక, శిథిలమైపోవుచున్న ఇంటినికూడా బాగుచేయించుకొను శక్తిలేక ఆర్థిక ఇబ్బందులతో కాలము వెళ్ళబుచ్చు తున్నాను. ప్రతినిత్యము తాతగారిని ఆరాధించుచు జీవించుచున్నాము.

ఇట్లు

బెల్లంకొండ రామకోటేశ్వరరావు

పమిడిపాడు,నరసరావుపేట, గుంటూరుజిల్లా-522 601

## అపర శంకరుడు

# శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రుడు

**(1875-1914)**



జ్ఞానానన్దమయం రామం - నిర్మలస్ఫటికాన్తరమ్।
ఆధారం తత్వ విద్యానాం - హయగ్రీవాయితం నుమః॥

అజీర్ణ భౌమ మధ్యార్తం - జీర్ణ భౌమ శిరశ్శ్రియమ్।
విశిష్టాద్వైతినం శేషం - రామం అద్వైతినం నుమః॥

శ్రీః

# ఆత్మాష్టకమ్

## సవ్యాఖ్యానమ్

## శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితమ్

## సెలయేఱువ్యాఖ్యా

(ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

## మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

**శ్లో॥ అత్రైవ దేహే పరిమృగ్యతే జ్ఞైః**
**సోఽయం పరాత్మా పరిలభ్యతే చ।**
**హృత్పద్మకోశాఖ్య దరం దధానః**
**తద్వ త్సహస్రారమపి స్వవిత్త్యై॥** 1

హృత్పద్మకోశస్సహస్రారచక్రం చేత్యుభయం పరమాత్మన ఉపలబ్ధిస్థానత్వాత్పరమాత్మన స్తదుభయ ధర్తృత్వం. విత్తిరుపలబ్ధిః।

**ప్రతిపదార్థము :-** స్వవిత్త్యై=తనను తెలిసికొనుటకు, హృత్పద్మకోశాఖ్య="హృదయ పద్మపు మొగ్గ" అనుపేరు గల, దరమ్=శంఖమును, తద్వత్=అట్లే, సహస్రార మపి=సుదర్శన చక్రమును, సహస్రార పద్మమును గూడా, దధానః=ధరించిన, సోఽయమ్=ఆ ఈ, పరాత్మా=పరమాత్మ అయిన శ్రీ మహావిష్ణువు, జ్ఞైః=పండితుల చేత,అత్ర=ఈ, దేహేఏవ=శరీరమునందే, పరిమృగ్యతే=అన్వేషింప బడుచున్నాడు, పరిలభ్యతే చ=పొందబడుచున్నాడు గూడ.

**తాత్పర్యము:-** శ్రీమహావిష్ణువు శంఖచక్రములను ధరించును. ఆయన అంతర్యామిగా పరమాత్మగా మన దేహములందు ఉండును. అట్టిచో మన హృదయపద్మమే ఆయన శంఖము. మన శిరమునందలి సహస్రార చక్రమే ఆయన ధరించిన సుదర్శనము. వీనిని ఆయన ధరించుటకు కారణము 'మనము' ఆయనను తెలిసికొనుటకే. కనుకనే ఈ విషయము తెలిసిన పండితులు తమ దేహములయందే ఆ పరమాత్మకై అన్వేషించుచున్నారు. ఆయనను అందికొను చున్నారు.

**విశేషములు:-** 1) పరమాత్మ సర్వజీవులకు హృదయస్థానమున నుండును అని 'గీత' చూ॥ "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి". 2) హృత్పద్మ కోశము అనగా తామర మొగ్గ వంటి హృదయము అని అర్థము. ఇది అనాహత చక్రస్థానము. ఇచ్చట అనాహతనాదము వినబడునని యోగ శాస్త్రము. ఇది దహరాకాశము. కనుక కవి దీనిని 'శంఖము'గా చెప్పెను. శంఖము నాదస్థానము కదా! 3) హృదయ స్థానమున మొదలయిన నాదము సహస్రారమున లయము చెందును. నాద స్వరూపుడు కృష్ణుడే. నాదాంతము బ్రహ్మమే. కనుక హృదయ, శీర్ష స్థానములు పరమాత్మ లభించు స్థానములు. 4) శంఖచక్రధారియే పరమాత్మ. ఆయనయే ప్రత్యగాత్మగా అవతరించెను. శంఖచక్రములు హృదయ, శీర్షములుగా అవతరించినవి. కాగా పరమాత్మకు ప్రత్యగాత్మకు అభేదము చెప్పబడినది.

**శ్లో॥ మాయాయుతత్వా త్కమలాసహాయః**
**నారాయణోఽన్తఃకరణేరణేన।**
**సర్వత్ర సత్త్వాదపి దేవనాచ్చ**
**శ్రీవాసుదేవోఽప్యయ మన్తరాత్మా॥ 2**

అంతఃకరణాని జీవాః, నారం జీవసమూహః, దేవనాద్భాసనాత్।

**ప్రతిపదార్థము:-** అయమ్=ఈ, అంతరాత్మా=ప్రత్యగాత్మ, మాయాయుతత్వాత్= మాయచే కలిసిన వాడగుట వలన, కమలాసహాయః=లక్ష్మీపతి అగును, అంతః కరణ=అంతఃకరణముల యొక్క, ఈరణేన=ప్రేరణ చేత, నారాయణః=నారాయణ స్వరూపుడు, సర్వత్ర=సమస్తప్రపంచమునందు, సత్త్వాత్=ఉండుటవలన, అపి చ=ఇంతేగాక, దేవనాత్=ప్రకాశింపజేయుటవలన, శ్రీ=లక్ష్మీసమేతుడైన, వాసుదేవోఽపి= వాసుదేవుడు గూడా.

**తాత్పర్యము:-** శ్రీమహావిష్ణువునకు లక్ష్మీదేవి సహచరి. నిత్యానపాయిని. ఆయన నారాయణుడు అనగా నారము=జీవ సమూహము. వీరియందుండి వీరిని నడపించువాడు అని అర్థము. "భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అని గీతా వాక్యము. ఆయనకు "వాసుదేవుడు" అని పేరు. వాసు అనగా సర్వత్ర నివసించువాడు. దేవః=అనగా దేవయతి=ప్రకాశింపజేయువాడు అని అర్థము. అనగా సర్వవ్యాపి, సర్వ ప్రకాశనుడు అని అర్థము. ఈ పరమాత్మయే దేహములో 'అంతరాత్మ' గా అవతరించినాడు. లక్ష్మి మాయగా

అవతరించినది. దేహములో అంతఃకరణములను ప్రేరేపించుచున్నాడు. కనుక 'నారాయణుడు'. (అద్వైతమతములో 'అంతఃకరణములే జీవులు ('లింగం తజ్జీవసంజ్ఞితం' అను వేదాన్తపంచదశి ఇచట ప్రమాణము) విశిష్టాద్వైతములో జీవులు (ప్రత్యేక వస్తువు) శరీరమునందంతట వ్యాపించుటవలన, శరీరమును జ్ఞానముతో ప్రకాశింపజేయుట వలన అంతరాత్మ వాసుదేవుడు అగును.

**విశేషములు:-** 1) అంతరాత్మను పరమాత్మను (అనగా విష్ణువును) అభిన్నముగా చిత్రించినాడు. 2) పరమాత్మ లేనిదే మనకు జగత్తు లేదు. అది మనకు భాసించదు. దానికి భౌతికముగా అస్తిత్వము లేదు. అట్లే మనలో అంతరాత్మలేనిదే మన శరీరమునకు జ్ఞానము, వెలుగు లేదు. 'శవము' అగును. 3) 'న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం, నేమా విద్యుతోభాంతి కుతోఽయ మగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వగ్, తస్య భాసా సర్వ మిదం విభాతి' (యాజుషీయ శ్వేతాశ్వతరోపనిషత్) అను వేద వాక్యము వలన 'శ్రీవాసుదేవ' పదము వ్యాఖ్యాన మగును. తస్య భాసా సర్వమిదం విభాతి' అనగా 'పరమాత్మకాంతితో ఈ సమస్తము వెలుగుచున్నది. అని అర్థము. కనుక ఈ 'కాంతి' అంతయు ఆయనదే. అనగా భగవంతుడు సమస్తము నందున్నాడు అని స్పష్టము. ఆయన కాంతివలననే సమస్తము వెలుగుచున్నది. కనుక 'వాసుదేవుడు'. మఱియు,

"వాసనాత్ వాసుదేవస్య-వాసితం తే జగత్త్రయమ్।
సర్వభూతనివాసోసి-వాసుదేవ నమోఽస్తు తే।

4) జీవుడు మాయాసమేతుడు. ఈశ్వరుడు మాయా సమేతుడు. చూ॥ 'స ఈశో యద్వశేమాయా, స జీవో య స్తయార్దితః' (భాగవత వ్యాఖ్యా)తేడా ఏమనగా జీవుడు మాయావశుడు.

శ్లో॥ వేదైకవేద్యో యదయం మహాత్మా
సత్కీర్త్యతే తద్ద్విజరాజ కేతుః।
ప్రాణస్థితత్వా త్ఫణిరాజ శాయీ
చిత్తాభ్రవాసా త్పరమాభ్ర వాసీ॥ 3

గరుడస్య వేదమయత్వాదితిభావః। ప్రాణస్య అమితహంసవృత్తిమత్త్వా చ్ఛేషస్య చామిత శిరస్కత్వా త్సహస్ర శబ్దస్య చామితవాచిత్వాదితి భావః। పరమాభ్రం పరమవ్యోమ।

**ప్రతిపదార్థము:–** అయమ్=ఈ, మహాత్మా=పరమాత్మ, వేదైకవేద్య=వేదమాత్రముచే తెలియదగినవాడు, ఇతియత్ తత్=కనుక, ద్విజరాజ= పక్షిరాజయిన గరుడుడు, కేతుః=జెండాగా గలవాడుగా, సంకీర్త్యతే=కొనియాడబడుచున్నాడు, ప్రాణ= ప్రాణములయందు, స్థితత్వాత్=ఉండుటవలన, ఫణిరాజ శాయీ=సర్పరాజ శయనుడని, చిత్తాభ్ర= మనస్సు అనే ఆకాశమునందు, వాసాత్= ఉండుటవలన, పరమాభ్ర=పరమాకాశము నందు, వాసీ=ఉండువాడుగా, సంకీర్త్యతే=కొనియాడ బడుచున్నాడు.

**తాత్పర్యము:–** భగవంతుడు వేదవేద్యుడయినందువలన ఆయనను గరుడధ్వజుడు అందురు. గరుడుడు వేదస్వరూపుడని శాస్త్రము. అట్లే అంతరాత్మయును వేదవేద్యుడే. 'అంతరాత్మ' గలదని వేదమేగదా చెప్పినది. అవైదికమతముల దృష్టిలో సర్వవ్యాపి అయిన 'ఆత్మ' లేదు గదా! శరీరమో, ప్రాణమో, మనస్సో 'ఆత్మ' అని అవైదిక మతములు చెప్పును. కనుక 'అంతరాత్మ' వేదవేద్యుడే. ప్రాణములు అనగా మన ఉచ్ఛ్వాస నిశ్వాసములు. అవి అనంతములయినవి. కనుక ప్రాణములయందున్న అంతరాత్మ అనంత ఫణములపై నున్న పరమాత్మ యే. శరీరమునందున్న మనస్సు ఒక ఆకాశము. మనలోని సుషుమ్నానాడి చిదాకాశము. దీనియందున్నవాడు అంతరాత్మ. ఈ అంతరాత్మ పరమాకాశము నందున్న వైకుంఠవాసియైన పరమాత్మయే.

**విశేషములు:–** 1) 'వేదము' అనగా 'జ్ఞానము' అని మఱొక అర్థము. జీవుడే బ్రహ్మము. బ్రహ్మమే జీవుడు. లేక జీవుడు వేఱు' అనుకొన్నను (అనగా అద్వైత, విశిష్టాద్వైతములలో) 'జీవుడు' జ్ఞానస్వరూపుడే. కనుక అంతరాత్మ, పరమాత్మ – ఇర్వురు వేదవేద్యులే. అనగా జ్ఞానమును బట్టి తెలియదగినవారే. 2) గరుడుడు వేదస్వరూపుడే. అందుకు ప్రమాణము. భాగవత గజేంద్రమోక్ష ఘట్టమున గల శ్లోకము. *'ఛందోమయేన గరుడేన స ఉహ్యామానః*

*చక్రాయుధో భ్యగమ దాశు యతో గజేంద్రః'*

**'త్రివృద్వేదః సుపర్ణాఖ్యః యజ్ఞం వహతి పూరుషం'** అని భాగవతము

12వ స్కంధం 11వ అధ్యాయంలో గలదు. వ్యాఖ్యలో, త్రివృత్=ఋగ్యజుస్సామ రూపో వేదః అని వ్రాసి, 'సుపర్ణోసి గరుత్మాన్ త్రివృత్తే శిరః' అను శ్రుతి

చూపబడెను. 3) బృహద్రథంతర సామములు గరుడస్వరూపములని సంప్రదాయము. 'బృహద్రథంతరే పక్షౌ, స్తోమ ఆత్మా' - శ్రుతి. 4) హృదయము గరుడస్థానము దానియందు అంగుష్ఠ రూప పరమాత్మ గలదు. శ్వాసకోశములు గరుడుని ఱెక్కలు. అని యోగసంప్రదాయము. 5) ప్రాణములు అనంతునితో సమానము. ఈ రెండిటికి సహస్రశిరస్సులు గలవు. ప్రాణములకు అనేక శ్వాసలే శిరస్సులు. అదే పోలిక.

శ్లో॥ ధీ వృత్తివిత్త్యాత్మక కౌస్తుభాప్తః
చతుః పుమర్థాఖ్య భుజాన్ దధానః।
రాగాఖ్య పీతామ్బర సంవృతాత్మా
చ్యుత స్స్వరూపా న్న య దచ్యుత స్తత్॥ 4

ధీ వృత్తివిత్తిః వృత్తిజ్ఞానం, రాగో భక్తానామాత్మ విషయకభక్తిః॥

**ప్రతిపదార్థము:-** ధీవృత్తివిత్తి=మనోవృత్తిజ్ఞానమే, ఆత్మక=స్వరూపముగా గల, కౌస్తుభ=కౌస్తుభముచేత, ఆప్తః=పొందబడినవాడు, చతుః=నాలుగయిన, పుమర్థాఖ్య=పురుషార్థములను పేరుగల, భుజాన్=భుజములను, దధానః=ధరించువాడును, రాగాఖ్య=రాగము అనుపేరుగల (భక్తి), పీతాంబర=పట్టు వస్త్రముచే, సంవృత= ఆవరింపబపడిన, ఆత్మా=స్వరూపముగల ఆ పరమాత్మ, యత్=ఎందువలన, స్వరూపాత్=తన ఆనందస్వరూపము నుండి, న చ్యుతః =జాఱలేదో, తత్=అందువలన అచ్యుతః=అచ్యుతుడయ్యెను.

**తాత్పర్యము:-** పరమాత్మకు కౌస్తుభము గలదు. అంతరాత్మకు జ్ఞానరూపమయిన కౌస్తుభము గలదు. పరమాత్మకు '4' భుజములు గలవు. అంతరాత్మకు '4' పురుషార్థములే కర్తవ్యములుగా గలవు. పరమాత్మకు పీతాంబరము గలదు. అంతరాత్మకు రాగము అనగా ఆత్మవిషయకమయిన భక్తి గలదు. జ్ఞానియొక్క అంతరాత్మ తన స్వరూపమును మఱచి మాయలో పడదు. పరమాత్మయు మాయలో పడదు. కనుక అంతరాత్మయు పరమాత్మయు అచ్యుతులే. అనగా అద్వైతమే.

**విశేషములు :-** 1) భాగవతము ద్వాదశ స్కంధమున ఏకాదశాధ్యాయమున విష్ణురూప రహస్యవర్ణనలో "కౌస్తుభవ్యపదేశేన-స్వాత్మజ్యోతిః బిభర్త్యజః" అను

శ్లోకమును బట్టి కౌస్తుభము అనగా "ఆత్మచైతన్యము" అనగా జ్ఞానచైతన్యము అని అర్థము. కాగా పరమాత్మకు జ్ఞానము కౌస్తుభము, అంతరాత్మకు మనో వృత్తిరూప జ్ఞానము కౌస్తుభము. (2) 'సంవిత్ హృదయముచ్యతే' అని జ్ఞానస్థానము హృదయము కనుక అచ్చట కౌస్తుభము అనగా జ్ఞాన ప్రకాశమే. నేను అను సంవిత్తు జీవునకయినను హృదయమునందే. కనుక అంతరాత్మ పరమాత్మలకు తమ జ్ఞానములే కౌస్తుభములు. కనుక అద్వైతము.

**(3) ఆత్మాన మస్య జగతః-నిర్లేప మగుణామలమ్**
**బిభర్తి కౌస్తుభమణిం-స్వరూపం భగవాన్ హరిః - భాగవత వ్యాఖ్యా**

కనుక కౌస్తుభము నిర్మల జ్ఞానము భగవంతుని స్వరూపము అని విదితము. (4) 'చతుర్ణాం పురుషార్థానాం-దాతాదేవః చతుర్భుజః' అని జయదేవ కవి చమత్కరించెను. 4 పురుషార్థములను ఇచ్చుటకు 4 చేతులను ధరించినవాడు విష్ణువు అని దీని భావము. ఈ భావమే పై శ్లోకము.

**శ్లో॥ కృష్ణః సదానన్దమయత్వతోఽయం**
**స్వప్నే యథా జాగ్రతి చాత్ర సర్వమ్।**
**ఆస్తే హి విశ్వమ్భర ఏష తస్మాత్**
**దామోదరః పఙ్కజనాభ ఏవ॥** 5

హి యస్మాత్।

**ప్రతిపదార్థము :-** అయమ్=ఈ ఆత్మ, సదా=ఎల్లపుడు, అనందమయత్వతః= ఆనందపూర్ణుడగుట వలన, కృష్ణః=కృష్ణుడగును. అత్ర=ఈ ప్రపంచమున (ఈ దేహమున) స్వప్నే యథా=స్వప్నమునందు వలె అనగా నిద్రయందు వలె, జాగ్రతి చ=జాగ్రద్దశయందును అనగా మెలకువయందును, సర్వమ్= సమస్తమును వ్యాపించి, ఆస్తేహి=నివసించును గదా! అందువలన, విశ్వంభరః=విశ్వమును భరించువాడు, తస్మాత్=అందువలన, ఏషః= ఈ ఆత్మ, దామోదరః=దామోదరుడు మరియు, పంకజనాభ ఏవ= పద్మనాభుడే.

**తాత్పర్యము:-** అంతరాత్మ నిత్యము ఆనందమయము అయినది. కనుక కృష్ణుడు అని చెప్పదగును. (చూ॥ విశేషములు) స్వప్న జాగ్రత్కాలములందు ఈ శరీరము నందంతట వ్యాపించియుండును కనుక ఆత్మ విశ్వంభరము. కనుక అంతరాత్మ

గూడా పరమాత్మవలె దామోదరుడే, పద్మనాభుడే. దామోదరుడు అనగా మాల ఉదరమునందు వ్రేలాడు వాడు. 'మాల' అనగా వనమాల అనగా గుణవంత మయిన రమణీయమయిన 'ప్రకృతి' శోభతో అలరారువాడు. పద్మనాభుడు అనగా నాభియందు పద్మము గలవాడు. ఈయన సృష్టికి మూల పురుషుడు. మొదటివాడు అంతరాత్మ అంతర్యామి. రెండవవాడు పరమాత్మ. అట్లే కృష్ణుడు ఆనందమయుడు. పరమాత్మ. విశ్వంభరుడు అంతరాత్మ, విరాట్ అంతర్యామి అయనయే. దేహమునందు అంతరాత్మ, ప్రపంచమునందు అంతర్యామి, ప్రపంచము విరాట్ స్వరూపము – అది దామోదరము. అంతరాత్మ లోపల ఆనందమయుడు శరీరదృష్ట్యా విశ్వంభరుడు. శరీరమే విశ్వము. దానిని భరించువాడు. శరీర శోభతో అలరారుట వలన దామోదరుడు. దామము అనగా వనమాల అనగా త్రిగుణాత్మక మాయ. పంచభూత స్వరూపము. (చూ॥ విశేషములు)

విశేషములు :– (1) కృషిః భూవాచక శ్శబ్దః–ణశ్చ నిర్వృతివాచకః
తయో రైక్యం పరం బ్రహ్మ–కృష్ణ ఇత్యభిధీయతే॥

అను నిర్వచనము వలన ప్రకృతి పురుష ఐక్యము లేదా జీవబ్రహ్మైక్యము 'కృష్ణ' స్వరూపము. అది ఆనందరూపము. (2) 'పద్మం విశ్వం కరే స్థితమ్' – అని గోపాలోత్తరతాపనీయోపనిషత్, 'అబ్జకాండం జగద్బీజం ధృతం పాణౌ స్వలీలయా' అని కృష్ణోపనిషత్తు. దీనిని బట్టి పద్మము విశ్వమునకు విశ్వబీజమునకు ప్రతినిధి. దానికి దీనికి వికాస సంకోచములు కలవు. కనుక పద్మనాభుడు అనునది సృష్టిమూల స్థితి. (3) 'స్వాం మాయాం వనమాలాఖ్యాం, నానాగుణమయీం దధత్' అని భాగవత ద్వాదశస్కంధము; 'కంఠం తు నిర్గుణం ప్రోక్తం, మాల్యతే ఆద్యయాజయా' అని గోపాలోత్తరతాపనీయోపనిషత్. ఈ వాక్యములను బట్టి నిర్గుణ పరమాత్మను చుట్టి విస్తరించిన త్రిగుణాత్మక సృష్టియే యీ వనమాల. కనుక 'దామోదర' అనునది ప్రకృతి శోభితుడైన విరాట్ రూపము. కనుకనే శరదృతువులో 'కార్తీక దామోదరు'ని సేవ ఉండును. ప్రకృతి వికాసము శరత్తులో అధికము కదా! (4) జీవుడు ఆనందమయుడు కనుక కృష్ణుడు. జాగ్రత్, సుషుప్తి–దశలలో 2 ఉండును. శరీరమున వ్యాపించి నిలబెట్టును గనుక

విశ్వంభరుడు. త్రిగుణాత్మక శరీరధారి కనుక దామోదరుడు. శరీరాత్ పూర్వము సృష్టికి కారణమయిన అనంద స్వరూపుడు కనుక పద్మనాభుడు. కనుక అంతరాత్మ పరమాత్మల మధ్య అద్వైతము.

శ్లో॥ తత్త్వం మహద్బ్రహ్మమయం యదస్మాత్
అహంకృతీ రుద్రమయీ చ జజ్ఞే।
తదుచ్యతే కేశవ ఇత్యయం యత్
కుతోఽపి జజ్ఞే న తతోఽజ ఏషః॥ 6

మహత్తత్త్వం ధీః, అత్ర శ్లోకద్వయే "కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః। తయోరైక్యం పరబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే॥ క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్। ఆవాం తవాఙ్గే సమ్భూతౌ, తస్మాత్కేశవ నామవా" నితి స్మృతిద్వయం వేద్యమ్।

**ప్రతిపదార్థము:-** యత్=ఏ కారణము వలన, అస్మాత్=ఈ ఆత్మ నుండి, బ్రహ్మమయమ్=బ్రహ్మ స్వరూపమయిన, మహత్='మహత్' అను,తత్త్వమ్=తత్త్వము, రుద్రమయీ=రుద్రరూపమయిన, అహంకృతిఃచ=అహంకారము గూడా, జజ్ఞే= పుట్టెనో, తత్=ఆ కారణమున, అయమ్=ఈ పరమాత్మ, కేశవ ఇతి=కేశవుడని, ఉచ్యతే=చెప్పబడును. కుతోపి=దేనినుండియు, అయమ్=ఈ పరమాత్మ, యత్=ఎందువలన, న జజ్ఞే=పుట్టలేదో, తతః=అందువలన, ఏషః=ఇతడు, అజః='అజుడు' అని చెప్పబడును.

**తాత్పర్యము:-** పరమాత్మ నుండియే మహత్తత్వము పుట్టినది. అది 'బ్రహ్మ' దేవుడు అని చెప్పబడును. అంతరాత్మ నుండి బుద్ధి పుట్టినది. అది 'మహత్తత్వము' బుద్ధి సృష్టికర్త కదా! పరమాత్మ నుండి అహంకారము పుట్టెను. అది రుద్రతత్వము. అంతరాత్మ నుండియే అహంకారము పుట్టెను. కనుక పరమాత్మను కేశవుడందురు. క=బ్రహ్మ, ఈశ=ఈశ్వరుడు, కేశవ=అనగా బ్రహ్మ ఈశ్వరులు గలవాడు. జీవుడున్ను అనగా అంతరాత్మయు పై '2' తత్వములు గలవాడే. కనుక కేశవుడు. పరమాత్మ అయినను, అంతరాత్మ అయినను పుట్టుక లేనివారు. కనుక అజులే. అని అద్వైతము చెప్పబడినది.

**విశేషములు :-** (1) క ఇతి బ్రహ్మణో నామ-ఈశోఽ హం సర్వ దేహినామ్

అవాం తవాంగే సంభూతౌ తస్మాత్కేశవ నామవాన్॥

అను వాక్యము 'కేశవ' శబ్దమునకు ప్రమాణము. (2) యో బ్రహ్మాణం విదధాతి పూర్వం-యో వై వేదాగ్ శ్చ ప్రహిణోతి తస్మై-శ్వేతాశ్వతరోపనిషత్. 'నారాయణాత్ బ్రహ్మ జాయతే నారాయణాత్ రుద్రో జాయతే' అను శ్రుతి వాక్యములు గూడా శ్రీహరి నుంచి బ్రహ్మరుద్రులు పుట్టిరనుటకు ప్రమాణములు.

శ్లో॥ అలం న యస్మాదము మిన్ద్రియాణాం
గణో గ్రహీతుం తదధోక్షజోఽయమ్।
సుషుప్తి మూర్ఛాదిషు సర్వ మేతత్
యదర్దయత్యేష జనార్దన స్తత్॥ 7

వాసుదేవం పరిత్యజ్య య ఉపాస్తేఽన్య దేవతామ్।
తృషితో జాహ్నవీతీరే కూపం ఖనతి దుర్మతిః॥ ఇతి స్మరణాదితి భావః

ప్రతిపదార్థము :- యస్మాత్=ఏ కారణము వలన, అముమ్=ఈ పరమాత్మను, ఇంద్రియాణామ్=ఇంద్రియముల, గణః=సమూహము, గ్రహీతుమ్=గ్రహించుటకు, న అలమ్=చాలదో, తత్=అందువలన, అయమ్=ఈ పరమాత్మ, అధోక్షజః =అధోక్షజుడు అని పిలువబడును. సుషుప్తి=గాఢ నిద్రలోను, మూర్ఛాదిషు= మూర్ఛ, ప్రలయముల యందు, ఏతత్=ఈ, సర్వమ్=విశ్వవ్యవహారమును, యత్ =ఎందువలన, అర్దయతి=సంహరించుచున్నాడో, తత్=అందువలన, జనార్దనః =జనార్దనుడు అగుచున్నాడు.

తాత్పర్యము:- అధోక్షజుడు అనగా అక్షజమయిన జ్ఞానము ఎవనికన్న క్రిందిదో అతడు' అని అర్థము అనగా ఇంద్రియ జన్యజ్ఞానమునకు అందనివాడు ఆత్మ. పరమాత్మ అయినను ప్రత్యగాత్మ అయినను ఇంద్రియ జన్యజ్ఞానములకు అతీతులు. అట్లే గాఢనిద్రలో గాని మూర్ఛలో గాని ఈ ప్రపంచము మనకు గోచరింపదు. కేవలము సాక్షి భావముగా మాత్రమే ఆత్మ నిలిచియుండును. పరమాత్మయు ప్రలయమునందు సాక్షిగా నుండును. కనుక ఆత్మ పరమాత్మలు సాక్షులే. కనుక అద్వైతము. ఇద్దఱు అధోక్షజులే, జనార్దనులే.

విశేషములు :-(1) 'అధః అక్ష (ఇంద్రియ) జం జ్ఞానం యస్మాత్' అను

2] విగ్రహ వాక్యముతో 'అధోక్షజ' శబ్దము ఏర్పడినది. (2) జనార్దనుడు అనగా

జనమును పీడించువాడు అని యర్థము. కాని భగవంతుడు 'జనపీడాకారకుడు' అను అర్థము యుక్తము కాదు. కనుక ఈ పదమునకు 'లయకారి' అని అర్థము. సర్వ ప్రపంచమును చివఱకు లయము చేయును కనుక జనార్దనుడు. జీవుడు గూడా నిద్రలో సర్వప్రపంచమును ఉపసంహరించుకొనియుండును. కనుక జనార్దనుడు. (3) 'పరాంచి ఖాని వ్యతృణత్-స్వయంభూః' అను వేద వాక్యము వలన, ఇంద్రియములు బహిర్ముఖములు. కనుక అంతరాత్మను అవి దర్శింపలేవు. కనుక జీవుడున్ను ఇంద్రియజ్ఞానాతీతుడు కనుక అధోక్షజుడు. పరమాత్మయు 'యతో వాచో నివర్తంతే-అప్రాప్య మనసా సహ' అని వాఙ్మనసాతీతుడు.

శ్లో॥ తత్సర్వధర్మా న్పరిముచ్యభక్త్యా
సేవ్యోఽయ మేకో విదుషాం సదాత్మా।
యోఽముం విహాయాన్యసురోపసేవీ
గఙ్గాతటేఽన్ధుం ఖనతి స్మ సోఽజ్ఞః॥ 8

ప్రతిపదార్థము :- యః=ఎవడయితే, అముమ్=ఈ ఆత్మను, విహాయ=వదలి, అన్య=ఇతర, సుర=దేవతలయొక్క, ఉపసేవీ=సేవకుడగునో, సః=ఆ, అజ్ఞః= మూఢుడు, గఙ్గాతటే=గంగాతీరమున, అంధుమ్=బావిని, ఖనతి స్మ=త్రవ్వు చున్నాడు. తత్=అందు వలన, సర్వధర్మాన్=సమస్త కర్తవ్య అకర్తవ్యములను, పరిముచ్య=విడిచి, అయమ్=ఈ, ఆత్మా=ఆత్మ, ఏకః=ఒక్కడే, విదుషామ్= విద్వాంసులకు, సదా=నిత్యము, భక్త్యా=భక్తితో, సేవ్యః=సేవింపదగినవాడు.

**తాత్పర్యము:-** గంగను వదలిపెట్టి దాని తీరమున బావిని త్రవ్వువాడు ఎంతటి మూఢుడో శ్రీహరిని ఆత్మస్వరూపుని వదిలి ఇతర దేవతలను పూజించువాడు అంతటి మూర్ఖుడు. కనుక సర్వధర్మములను భగవత్పాదములందు వదలి భక్తితో ఆ పరమాత్మ సేవయే చేయవలయును. ఇది పండిత మార్గము.

విశేషములు :-

(1) వాసుదేవం పరిత్యజ్య య ఉపాస్తేఽన్యదేవతామ్।
తృషితో జాహ్నవీతీరే కూపం ఖనతి దుర్మతిః॥

అను వాక్యము పై శ్లోకమున చెప్పబడినది. ఇది నిదర్శనాలంకారము.
(2) 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అను ప్రపత్తి యోగమును ఈ శ్లోకము సూచించెను.

**ఇతి బెల్లంకొండ రామరాయకవి కృతిషు ఆత్మాష్టకమ్। సాధారణ భాద్రపద శుద్ధ సప్తమీ।**

**శ్రీః**

శ్రీః

# శ్రీ కృష్ణానద్యష్టకమ్

సవ్యాఖ్యానమ్

శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితమ్

సికతా వ్యాఖ్యా

(ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ)

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి,

శ్లో॥ సహ్యా క్షమాధర వర ప్రభవే! భవేనా
సహ్యా క్షమాగ జన పాపలయాయ సృష్టే।
జహ్యస్మదీయ భవ దావ భవోరుతాపమ్
నహ్యస్తి మే త్వదితరా గతి రత్ర కృష్ణే॥ 1

ప్రతిపదార్థము:- సహ్యా='సహ్యము' అను పేరుగల, క్షమాధరవర=పర్వతశ్రేష్టము నుండి, ప్రభవే=పుట్టినదానా, అసహ్యా=తీవ్రమయిన, క్షమాగజన=భూజనుల యొక్క, పాప=పాపములయొక్క, లయాయ=ప్రలయము కొఱకు, భవేన= శివునిచేత, సృష్టే= సృష్టింపబడినదానా, కృష్ణే=ఓ కృష్ణానదీ, అస్మదీయ=మా, భవ=సంసారమనెడి, దావ=అరణ్యమునందు, భవ=పుట్టినదావాగ్ని యొక్క ఉరుతాపమ్=తీవ్ర సంతాపమును, జహి=పోగొట్టుము, అత్ర=ఈ విషయము నందు, మే=నాకు, త్వదితరా=నీ కన్నవేఱయిన, గతిః=దిక్కు, నాస్తిహి=లేదు గదా!

**తాత్పర్యము:-** ప్రజల పాపప్రక్షాళన కొఱకు శంకరుడు నిన్ను సృష్టించెను. సహ్యాద్రి నుండి మా కొఱకయి పుట్టిన 'వర' గంగవు నీవు. మా సంసారదవాగ్ని తాపమును పోగొట్టుము. ఈ విషయములో నాకు నీవు తప్ప వేఱొకరు గతిలేరు.

**విశేషములు:-** ఈ అష్టకమంతయు 'హ్య' కారప్రాసతో సాగినది.

శ్లో॥ గుహ్యం త్వదీయవిభవం నసమీక్ష్య కృష్ణే
ముహ్యంతి వారిలహరీయ మితి త్వయీమే।
మహ్యర్థిత స్స భగవాన్ భవదాత్మ నాసీత్
మహ్యం శివం దిశ భవత్పద సంగతాయ॥ 2

**ప్రతిపదార్థము:-** హే కృష్ణే! =ఓ కృష్ణానదీ, ఇమే=ఈ నావంటి జనులు, గుహ్యమ్=రహస్య మయిన, త్వదీయ=నీ, విభవమ్=మహిమను, న సమీక్ష్య=చూడక, ఇయమ్=ఇది, వారిలహరీ ఇతి=నీటిప్రవాహము మాత్రమేయని, త్వయి=నీ యందు, ముహ్యంతి=భ్రాంతిపడుచున్నారు, సః=అ, భగవాన్=శివుడు, మహీ=భూమిచేత, అర్థితః=యాచింపబడినవాడై, భవదాత్మనా=నీ స్వరూపముతో, ఆసీత్=అవతరించెను, భవత్పద=నీ పాదములందు, సంగతాయ=కలిసిన, మహ్యమ్=నాకు, శివమ్=శుభమును, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** ఓ కృష్ణానదీ! నీ తత్త్వరహస్యమును తెలిసికొనలేని బాలిశులు నీవు కేవలము ఒక జల ప్రవాహమని భావించెదరు. కాని భూదేవి ప్రార్థనపై ఆ భగవంతుడే నీ రూపమున అవతరించెను. తల్లీ! నీ పాదములనంటిన నాకు 'శివ' ప్రదానము చేయుము.

**విశేషములు:-** 1) భగవంతుడు కృష్ణారూపమున ప్రవహించినట్లు స్థలపురాణము. శివుని వరము వలన పుట్టినట్లు ప్రథమ శ్లోకము చెప్పుచున్నది. దీనిని బట్టి కృష్ణానది శివావతారము. కనుక ఈ నది తనలో మునిగిన వారికి 'శివమును, శివుని ఇవ్వగలదు అని 'శివం దిశ' అని కవి సూచన. 2) కనుక ఇది కేవలము 'నీరు' కాదు అష్టమూర్తి యొక్క అవతారమూర్తి అని యర్థము. చూ॥ 'భూరంభాంస్యనలోఽనిలోంబర' – శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమ్.

**శ్లో॥** దుహ్యంత ఏవ కుశలైః సలిలాని తేఽర్థాః
దహ్యంత ఏవ నశివాని నృణాం జలై స్తే।
ఉహ్యంత ఏవ పరమం భజకాః త్వయా తత్
నహ్యంత ఏవ దురితైః తవ నాశ్రితాస్తు॥ 3

**రామరాయటీక:-** సలిలాని–కుశలాః – అర్థాః దుహంతి ఇత్యర్థః – దుహిః ద్వికర్మకః నశివాన్యశుభాని–భజకాన్ భక్తాన్ త్వం–తత్పరమం పదం వహసి –ప్రాపయసి ఇత్యర్థః నహ్యంతే బధ్యంతే.

**ప్రతిపదార్థము:-** కుశలైః=నేర్పుగల సాధకులచే, తే=నీ, సలిలాని=నీళ్లు, అర్థాః = ప్రయోజనములు, దుహ్యంత ఏవ=పితుకబడుచున్నవి, తే=నీ, జలైః=నీటిచేత, నృణామ్=నరులయొక్క, నశివాని=అశుభములు, దహ్యంత ఏవ=తగులబెట్టబడు

చున్నవి, త్వయా=నీచేత, భజకాః=భక్తులు, తత్=అ, పరమమ్=పరంజ్యోతి, ఉహ్యంత ఏవ=చేర్చబడుచున్నారు, తవ=నీకు, నాశ్రితాఃతు=అనాశ్రితులయితే, దురితైః=పాపములచే, నహ్యంత ఏవ=కట్టివేయబడుచున్నారు.

**తాత్పర్యము:-** కృష్ణానదీమతల్లీ! నేర్పరులయిన సాధకులు నీ తీర్థములనుండియే ప్రయోజనములు పొందుచున్నారు. నీ వారి ప్రవాహము నరుల దురితములను హరించును. నీవు భక్తులను పరమాత్మ వైపు తీసికొని పోవుచున్నావు. నిన్ను ఆశ్రయించని వారికి పాపబంధములు తప్పవు.

**విశేషములు:-** 'న' అను అవ్యయముతో సమాసము చేయబడిన పదములు ఈ శ్లోకములో విలక్షణములు. ఈ సమాసములో 'న' కార లోపము ఉండదు. అనగా 'నశివాని' ఇది 'అశివాని' కాదు. నాశ్రితాః - ఇది 'అనాశ్రితాః' కాదు. 2) ద్వికర్మక కర్మణి ప్రయోగము. ఇందులోని విశేషము.

**శ్లో॥** సహ్యంత ఏవ నిజభక్తజనాపరాధాః
గృహ్యంత ఏవ బలయో భజతాం త్వయా హి।
సహ్యంత రస్తి భగవాన్ నసుదుర్గ్రహోఽక్ష్ణా
గుహ్యం తవైవ సలిలం సకలై స్సుసేవ్యమ్॥ 4

**రామరాయటీక:-** గుహ్యం అప్రకాశమ్

**ప్రతిపదార్థము:-** త్వయా=నీచేత, నిజ=తన,భక్తజన=భక్తులయొక్క అపరాధాః = పొరపాట్లు తప్పులు, సహ్యంత ఏవ=సహింపబడుచున్నవి, భజతామ్=సేవించువారి యొక్క, బలయః=పూజలు, గృహ్యంత ఏవ హి=గ్రహింపబడుచునే యున్నవి గదా!, అక్ష్ణా=కంటిచే, నసుదుర్గ్రహః=చూడదగినవాడై, సః=అ, భగవాన్=భగవంతుడు, అంతః=నీలోపల, అస్తి హి=ఉన్నాడు కదా!, తవ=నీ, గుహ్యమ్=గోప్యమయిన తత్వము గల, సలిలమేవ=నీరే, సకలైః=అందఱిచే, సుసేవ్యమ్=సేవింపదగినది.

**తాత్పర్యము:-** తల్లీ! కృష్ణానదీ! నీ భక్తుల అపరాధములను క్షమించుచున్నావు. కనుకనే వారి పూజలను స్వీకరించుచున్నావు. అదృశ్యుడయిన భగవానుడు సైతము నీ ప్రవాహమున 'నరసింహ సాలగ్రామరూపమున నేత్ర గోచరుడై యున్నాడు. నీ పవిత్రతీర్థము సమస్త ప్రాణి సేవనీయము.

**విశేషములు:-** 1) ననుదుర్గ్రహః - 'న' అను అవ్యయముతో సమానము. సుదుర్గ్రహః=తేలికగా గ్రహింప శక్యము కానివాడు. దీనికి మఱల 'న' తగిలించుటవలన 'తేలికగా గ్రహింపశక్యము కానివాడు కానివాడు' అని అర్థము వచ్చును. అనగా తేలికగా గ్రహింపశక్యమయిన వాడు అని అర్థము. ఇంత డొంక తిఱుగుడుగా చెప్పుటలో తాత్పర్యమేమనగా, భగవంతుని అసలు స్థితి 'సుదుర్గ్రహుడు' కృష్ణానది వలన ప్రస్తుతము వచ్చిన స్థితి - ననుదుర్గ్రహుడు. కాగా భగవంతుని తనయందు ఆకర్షించి భక్తులకు అందించిన కరుణాశాలిని ప్రభావశాలిని యీ నది అని వ్యంగ్యము.

**శ్లో॥ గుహ్యం తదేవ పరమం సలిలాత్మనా తే**
**మహ్యం తు భాతి విదుషే బృహదేవ తే కమ్।**
**ద్రుహ్యంతి యే కుధిషణాః పరదేవతే తే**
**ద్రుహ్యంత్యకామవశతోఽపి నిజాత్మనే తే॥** 5

**రామరాయటీక:-** కం-జలం-నిజాత్మనే-ఇతి ఆత్మబ్రహ్మణోరభేదాత్ ఇతి భావః

**ప్రతిపదార్థము:-** పరమమ్=సర్వాతీతమయిన, తదేవ=ఆ బ్రహ్మవస్తువే, తే=నీ, సలిలాత్మనా=నీటి రూపముచే, గుహ్యమ్=దాచబడినది, విదుషే=విద్వాంసుడ నయిన, మహ్యంతు=నా కయితే, తే=నీ, కమ్=నీరు, బృహదేవ=బ్రహ్మముగనే, భాతి=స్ఫురించుచున్నది, పరదేవతే=ఓ పరాభట్టారికా, యే=ఏ, కుధిషణాః= బుద్ధిహీనులు, తే=నీకు, ద్రుహ్యంతి=ద్రోహముచేయుదురో, తే=వారు, అకామ వశతోపి=అసంకల్పితముగానయినను, నిజాత్మనే=తమ ఆత్మకే, ద్రుహ్యంతి =ద్రోహము చేసికొనుచున్నారు.

**తాత్పర్యము:-** రహస్యమయిన ఆ పరవస్తువు నీ జలరూపముతో అవతరించినది. కనుక సామాన్యులు దీనిని జలముగా భావించెదరు. కాని జ్ఞానదృష్టితో నున్న నాకు నీ నీరంతయు 'బ్రహ్మ' రూపముగా భాసించుచున్నది. నీకు నీ నదీ రూపమునకు - నీరే కదా! అని - ద్రోహము చేసిన వారు - తమకు తెలియకుండా - తమ ఆత్మకే ద్రోహము చేసికొనుచున్నారు.

**విశేషములు:-** 1) **'యోఽపా మాయాతనం వేద ఆయతనవాన్ భవతి'** అను వేదమంత్రము ప్రకారము జలమునకు ఆయతనమయినవాడు 'పరమాత్మ' యే.

మనకు ఆయతనమయినవాడు పరమాత్మయే. నీరు నీరుకాదు బ్రహ్మ స్వరూపమే. మన ఆత్మయును బ్రహ్మయే లేదా బ్రహ్మస్వరూపమే. కనుక 'కృష్ణ' కు ద్రోహము చేయువాడు 'ఆత్మ' ద్రోహము చేసికొనుచున్నాడు అని అర్థము. 2) ఇచ్చట వాక్యార్థ నిదర్శనాలంకారము వ్యంగ్యము.

శ్లో॥ మహ్యద్రిభూజపటలేఽపి భవత్ప్రసక్తే
స్నిహ్యంతి శంకర మహేంద్ర ముఖాశ్చ దేవాః।
స్నిహ్యంతి యే తటగతా స్తవ వాః కుటుంబే
ద్రుహ్యంతి తేఽపి బత సంసృతయేఽభిగేయే॥ 6

**రామరాయటీక:-** హే అభిగేయే! సంసృతయే ద్రుహ్యంతి ముక్తా భవంతి ఇత్యర్థః

**ప్రతిపదార్థము:-** అభిగేయే=కొనియాడదగినదానా!, భవత్ప్రసక్తే=నీతో సంబంధము గల, మహీ=భూమియందు, అద్రి=పర్వతములందు, భూజపటలేపి= వృక్షసమూహము నందున్న, శంకర=శంకరుడు, మహేంద్ర=ఇంద్రుడు, ముఖాః =మొదలుగాగల, దేవాఃచ=దేవతలుగూడా, స్నిహ్యంతి=ప్రేమబంధము పెంచి కొనుచున్నారు, యే=ఎవరు, తటగతాః=తీరమునందున్నవారై, తవ=నీ, వాః కుటుంబే=జలకుటుంబము నందు, స్నిహ్యంతి=స్నేహము పెంచికొనుచున్నారు, తేఽపి=వారున్ను, సంసృతయే=సంసారమునకు, ద్రుహ్యంతి=ద్రోహముచేయు చున్నారు.

**తాత్పర్యము:-** నీ తీరమునందున్న వృక్షపర్వతములందు సైతము శంకరాది దేవతలకు గూడా ప్రీతి గలదు. నీ తీరమున నివసించుచు నీ జలప్రవాహము నందు స్నానముచేయువారికి సంసారము నుండి ముక్తి కలుగును.

**విశేషములు:-** 1) ఇందులో 3,4 పాదములకు మఱొక అర్థము చెప్పవచ్చును. తీరముననున్న వృక్షములు మొదలగు సైతము నీ 'వఱద' ప్రవాహములో మునిగి సంసారబంధముల నుండి మోక్షము పొందును. వృక్షాదులును జీవులే కనుక వానియందు శంకరాదుల అనుగ్రహము, వానికిని చివఱకు ముక్తి అని సూచింప బడినది.

శ్లో॥ నహ్యస్తి తే తటగతేష్వజనార్దనో నా
గృహ్య స్తవేశ్వరి! గుణేషు జనార్దనో హి।

మహ్యాంబురాశియుగలం సలిలం తవైవా-
సహ్యం వహత్ త్రిభువనం చ పునాతి ధత్తే॥ 7

**రామరాయటీక:-** నా-మనుష్యః గృహ్యః పక్షపాతీ-అసహ్యం దుస్సహం వేగాదితి భావః.

**ప్రతిపదార్థము:-** తే=నీ, తటగతేషు=ఒడ్డునజేరినవారిలో, అజనార్దనః=విష్ణువు కాని, నా=నరుడు, న అస్తి హి=లేడు కదా!, ఈశ్వరి=జగదీశ్వరీ! కృష్ణా!, జనార్దనః =విష్ణువు, తవ=నీ, గుణేషు=గుణములయందు/నీటియందు, గృహ్యః=పక్షపాతము గలవాడు, పెంపుడు ప్రాణిగానున్నవాడు, హి=కదా!, తవ=నీ యొక్క సలిలం ఏవ=నీరే, అసహ్యమ్=తీవ్రముగా, మహ్యాంబురాశి=భూసముద్రముల, యుగలమ్ =జంటను గూర్చి, వహత్=ప్రవహించుచు, త్రిభువనం చ=ముల్లోకములను గూడా, పునాతి=పవిత్రము చేయుచున్నది.

**తాత్పర్యము:-** నీ తీరమునందున్న వారందఱును కృష్ణస్వరూపులే. సాక్షత్తు విష్ణువే నీ గుణములకు లేదా నీ గుణములయిన మధుర జలమునందు ప్రేమతో నరసింహ సాలగ్రామరూపమున నిలిచియున్నాడు. తీవ్రవేగముతో 'నేల' తడుపుచు సముద్రమును పెంచుచు ప్రవహించు నీ 'వేణి' ముల్లోకములను పెంచి పోషించుచున్నది.

శ్లో॥ మహ్యస్తి తే తటభువి త్రిజగత్యధీశః
న హ్యస్తనం స్మరతి శం తటగో జన స్తే।
నహ్యస్తి తే తటభువాం (తటనృణాం) అమృతం పరం కాత్
మహ్యం తదేవ దిశ మాత రిదం నమస్తే॥ 8

**రామరాయటీక:-** మహీ ఉత్సవశాలీ హ్యస్తనం-హ్యోభవం-శం-సుఖం నస్మరతి ఇదానీం తవ సుఖానుభవదశాయామ్ హ్యస్తన సుఖ స్మరణాసంభవాత్ ఇతి భావః.

**ప్రతిపదార్థము:-** తే=నీ, తటభువి=తీరభూమియందు, త్రిజగతీ=ముల్లోకములకు, అధీశః=ప్రభువయిన నరసింహుడు, మహీ=ఉత్సవములు గలవాడై, అస్తి= ఉన్నాడు, తే=నీ, తటగః=తీరగతుడైన, జనః=వ్యక్తి, హ్యస్తనమ్=నిన్నటి,

శమ్=మంగళమును, సుఖమును, నస్మరతి=తలచడు, తే=నీ, తటభువామ్= తీరమునందు పుట్టిన జీవులకు,(తటనృణాం=తీరమునందు పుట్టిన మనుష్యులకు), కాత్=నీ నీటికన్న, పరమ్= భిన్నము అయిన, అమృతమ్= అమృతము, న అస్తి హి=లేదు కదా!, మాతః=తల్లీ! కృష్ణానదీ!, మహ్యామ్=నాకు, తదేవ=ఆ అమృతమునే, దిశ=ఇమ్ము, ఇదమ్=ఇదిగో, తే=నీకు, నమః= నమస్కారము.

**తాత్పర్యము:-** తల్లీ కృష్ణా స్రవంతీ! త్రిలోకేశ్వరుడైన నృసింహదేవుడు నీ తీరము నందు నిలిచియున్నాడు. నీ తీరమునందు చేరినవారికి గత సుఖములు గుర్తురావు. అనగా 'మందోత్కంఠాః కృతాః తేన, గుణాధికతయా గురౌ' అన్నట్లు గొప్ప సుఖములో నుండగా అంతకు ముందటి చిన్న సుఖములు గుర్తురావు. కనుక కృష్ణాతీర నివాస సుఖము ముందఱ పాత సుఖములు గుర్తురావు. నీ తీరమునందు పుట్టినవారికి / వానికి నీ జలము కన్న 'అమృతము' ఏమున్నది. శిశువునకు 'తల్లిపాల' కన్న దివ్యపానీయము ఏమిగలదు? కనుక ఆ అమృతమే నాకును అనుగ్రహింపుము. అని రామకవి అభ్యర్థన.

**విశేషములు:-** 1) కంబ్రహ్మ, ఖంబ్రహ్మ అను శ్రుతివాక్యములను బట్టి 'కృష్ణాజలము బ్రహ్మ స్వరూపమే. 2) 'కం' అనగా సుఖము అనియు అర్థము. సుఖము ఆనందము అది భగవంతుని స్వరూపము. 3) 'యోఽ పామాయతనం వేద' అన్నట్లు 'నీరు- భగవంతుని స్వరూపమే'. జలతత్త్వము తెలిసినవాడు తన తత్త్వము తెలిసినవాడగును. 4) జలమునందున్న 'అమృతము' అనగా 'మరణము లేనిది' చైతన్యము. కనుక ఆ చైతన్యమును అనగా అట్టి ఆనంద చైతన్యమును తన కిమ్మని కవి ప్రార్థన.

ఇది శ్రీ బెల్లంకొండ రామరాయ కవికృత

**'శ్రీ కృష్ణానద్యష్టకము'**

**శ్రీః**

శ్రీః

# శ్రీ హయగ్రీవనవరత్నస్తుతిః

సవ్యాఖ్యా

శ్రీ బెల్లఙ్కొణ్డ రామరాయకవి విరచితా

**(1875-1914)**

**తారలీవ్యాఖ్యా**

**(ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య వివరణ)**

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్లో॥ ఓంకార లక్షిత మహోమయ సన్నఖాంశుమ్
నక్షత్ర పూజిత సహస్ర దళాఙ్ఘ్రి యుగ్మమ్।
మోదావహాదికమతాయిత గుల్ఫదేశమ్
లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥ 1

సవ్యాఖ్యా :- అథ రామో నామకవిః స్వాభీష్ట శ్రీ హయగ్రీవదేవతాం నవభిః శ్లోకైః సంపద్యమానః తన్మనుగతైః ఓంకారాదిభిః షడ్వింశత్యక్షరైః చరమేణోంకారేణచ తన్మంత్ర దేవతాయాః నఖాదికిరీటాన్తా న్యంగాని కల్పయిత్వా తాం చ కల్పనాం వ్యంగ్యమర్యాదయా భాసయన్ శ్రీ హయగ్రీవ ప్రత్యంగవర్ణనం సంక్షేపేణ విధత్తే ఓమిత్యాదిభిః :- ఓంకార లక్షిత మహోమయ సన్నఖాంశుం, ఓంకారేణ= ఓమిత్యక్షరేణ 'వర్ణాత్కార ఇతి కారః, లక్షితం=లక్షణయా ప్రతిపాదితం, అనిర్దేశ్యస్య బ్రహ్మణః సాక్షా న్నిర్దేశాసంభవా దితి భావః, మహః=తేజః చైతన్య మిత్యర్థః బ్రహ్మేతి యావత్, తస్య వికారాః తన్మయాః. వికారార్థే మయట్ నిర్వికారస్య బ్రహ్మణః వికారాసంభవాత్ ఉత్ప్రేక్షేయం, ఓంకారలక్షిత మహోమయా ఇవ స్థితా ఇత్యర్థః. సంతః=ప్రశస్తాః అప్రాకృతత్వా న్నిత్యా ఇతివా, నఖాః అంశవః =సూర్యకిరణా ఇవ అంశుశబ్దస్య తత్రైవ రూఢత్వాత్, యస్య తం తథోక్తమ్, అంశవ ఇవేత్యుపమా. అనేన ఓంకారస్థానీయా నఖా ఇతి గమ్యతే. తథా నక్షత్రపూజిత సహస్రదళాంఘ్రి యుగ్మం. నక్షత్రైః నిగీర్ణాతిశయోక్త్యా దేవతా కుసుమైః పూజితం=అర్చితం. యుక్త మితి యావత్, సహస్రదళయోః పద్మయో

రివ అంఘ్ర్యోః చరణయోః, యుగం= ద్వయం యస్య తం తథోక్తమ్, అనేన నకారస్థానీయ మంఘ్రియుగ మితి సూచ్యతే. ఏవ ముత్తరత్రాపి మోకారాది స్థానీయం గుల్ఫాదిక మవగమ్యత ఇతి ఊహ్యమ్. మోదావహాది కమఠాయిత గుల్ఫదేశం, మోదావహః=అతి సుందరత్వాత్ సంతోషకారీ, ఆదికమఠాయితః =ఆదికూర్మ ఇవాచరితః గుల్ఫదేశః యస్య తం తథోక్తం ఉపమా. లక్ష్మీహయాననం =లక్ష్మీయుక్తం హయగ్రీవం అహం శరణం ప్రపద్యే=ప్రాప్నోమి. ప్రజాయాం పితురపి మాతైవ వత్సలత రేతి న్యాయాత్ ఆదౌ లక్ష్మీ రేవ ప్రపత్తవ్యేతి లక్ష్మీ విశిష్టత్వ నిర్దేశః. విశేష్యస్య విశేషణజ్ఞానాధీనతాయా విశేష్యజ్ఞానా దాదావేవ యథా విశేషణజ్ఞాన మావశ్యకం తద్వద్ధయగ్రీవ ప్రపత్తే రాదావేవ లక్ష్మీ ప్రపత్తి రావశ్య కేతి భావః॥

**ప్రతిపదార్థము:-** ఓఙ్కార=ఓంకారము చేత, లక్షిత=లక్షణావృత్తిచే చెప్పబడిన, మహోమయ=చైతన్యమయమయిన, సత్=నిత్యమయిన, నఖాంశుమ్=సూర్య కిరణములవంటి నఖములు కలవాడును, నక్షత్ర=నక్షత్రములచేత అనగా దేవతా పుష్పములచేత, పూజిత=పూజింపబడిన, సహస్రదళ=వేయిదళాల తామరల వంటి, అంఘ్రియుగ్మమ్=పాదయుగ్మము గలవాడును, మోదావహ=సంతోషకర మయిన,ఆదికమఠాయిత=ఆదికూర్మమువంటి, గుల్ఫదేశమ్=సీలమండలు గల వాడును అగు లక్ష్మీ=లక్ష్మీ సమేతుడయిన, హయాననమ్=హయగ్రీవుని, అహమ్ =నేను, శరణమ్=శరణ్యునిగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** హయగ్రీవుని నఖములు ఓంకార లక్షితుడైన పరబ్రహ్మము యొక్క తేజస్సుతో నిండినవి. కనుక సూర్యకిరణముల వంటివి. సూర్యుని కిరణములు గూడా బ్రహ్మతేజో భరితములు కదా! హయగ్రీవుని చరణములు సహస్రదళ కమలముల వంటివి. విష్ణుపాదము ఆకాశము. దానికి విష్ణుపదమని పేరు. ఆకాశమునందు వికసించిన నక్షత్రములు దేవతలు విరజల్లిన దేవతా పుష్పముల వలె నున్నవి. సర్వావతార మూలస్వరూపుడైన హయగ్రీవుని గుల్ఫములు (సీల మండలు) ఆదికూర్మములవలె నుండినవి. లక్ష్మీ సమన్వితుడైన ఆ హయగ్రీవ దేవుని నేను శరణు వేడుచున్నాను.

**విశేషములు:-** 1) 'రామ' కవీంద్రుడు ఇష్ట దేవత అయిన హయగ్రీవుని 'నవ

రత్నముల' వంటి '9' శ్లోకములతో స్తుతి చేయుచున్నాడు. అందులో ప్రతిశ్లోకము లోను మొదటి '3' పాదముల మొదటి అక్షరములను హయగ్రీవ మంత్రాక్షరముతో పూరించి యీ స్తోత్రమును రచించెను. 2) మంత్ర దేవతకు మంత్రమే శరీరము. కనుక 'మంత్రాక్షరములు' దేవతావయవములు అగును. ఆ ప్రకారము ఈ పద్యములో 'ఓం, న, మో' అను అక్షరములతో '3' పాదములను రచించెను. అందులో ఓం=కాలిగోళ్లు, న=పాద ద్వంద్వము, మో=సీలమండలు. 3) మానవుల స్తుతిని తలనుంచి కాళ్లవఱకు చేయవలయును, దేవతల స్తుతి, పూజనీయుల స్తుతి పాదములనుంచి తలవఱకును చేయవలయను. కనుక ఈ స్తోత్రము హయగ్రీవ పాదముతో మొదలయినది. 4) ఓంకారము పరబ్రహ్మకు సంకేతమే కాని సాక్షాత్తు వాచకము కాదు. ఈశ్వరునకు అది వాచకము. 'బ్రహ్మమును' నిర్వచించుటకు వేదములే చాలవు. ఓంకారమయినను అంతే. 5) సంతానమునందు తండ్రికన్న తల్లికి ఎక్కువ వాత్సల్యము. కనుక ముందుగా 'లక్ష్మీ' నామము చెప్పబడినది.

శ్లో॥ **భద్ర స్మరేషుధి విలాస మనోజ్ఞ జఙ్ఘమ్**
**గవ్య ద్విపామల శిరో రుచిహారి జానుమ్।**
**వశ్యామరాసిత కటాక్ష రమార్చితోరుమ్**
**లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥** 2

సవ్యాఖ్యా:- భద్రస్మరేషుధి విలాసమనోజ్ఞ జంఘం, భద్రే=మంగళకరే, స్మరస్య= మన్మథస్య ఇషుధిః=తూణీరః తస్యేవ విలాసః=విభ్రమః తేన మనోజ్ఞే=మనోహరే జంఘే యస్య తం తథో క్తమ్. గవ్య ద్విపామల శిరో రుచి హారి జానుమ్, గౌః =సర్గః గౌర్ణాస్స్వర్గేబలీవర్దే ఇత్యభిధానమ్, తత్ర భవః గవ్యః దిగాదిత్వాద్యత్ సచాసౌ ద్విపః ఐరావతః తస్య యత్ అమలం=శ్వేతం, శిరః=కుంభస్థలం తస్య రుచిం హరత ఇతి రుచిహారిణీ జానునీ యస్య తం తథోక్తమ్, వశ్యామరాసిత కటాక్ష రమార్చి తోరుం, వశ్యా అమరా యేషాం తే వశ్యామరాః అసితాః కటాక్షాః యస్యాః తయా రమయా అర్చితః=పూజితః అలంకృత ఇతి యావత్. ఊరుః వామ ఇతి భావః యస్య తం తథోక్తం కటాక్షలీలయైవ సర్వా నింద్రాదీ న్వశీకృత వతీ లక్ష్మీః యస్య వామోరు మధితిష్ఠతి త మిత్యర్థః, అనేన సర్వదేవోత్తమత్వం హయగ్రీవస్య వ్యజ్యతే.

**ప్రతిపదార్థము:-** భద్ర=శుభమయినవియు, స్మరేషుధి=మన్మథుని అంబుల పొది యొక్క, విలాస=విలాసము వంటి విలాసముగల, మనోజ్ఞ=మనోహరమయిన, జంఘమ్=పిక్కలు గలవాడును, గవ్య=స్వర్గమునందలి, ద్విప='ఏనుగు' అయిన ఐరావతము యొక్క, అమల=తెల్లని, శిరః=కుంభస్థలము యొక్క, రుచి=కాంతిని, హారి=హరించు, జానుమ్=మోకాళ్లుగలవాడును, వశ్యామర=దేవతలు వశమై పోయిన, అసిత=నల్లని, కటాక్ష=క్రీగంటి చూపులుగల, రమా=లక్ష్మీదేవి చేత, అర్చిత=గౌరవింపబడిన, ఊరుమ్=తొడలుగలవాడును అయిన, లక్ష్మీ హయాననమ్=లక్ష్మీయుక్తుడయిన హయగ్రీవుని, అహమ్=నేను, శరణమ్= శరణ్యునిగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** హయగ్రీవుని జంఘలు అనగా పిక్కలు మంగళమయినవి. మన్మథ తూణీరములవలె మనోహరమయినవి. స్వామి మోకాళ్లు ఐరావత కుంభస్థలము వలె తెల్లగా బలముగా నున్నవి. ఏ దేవి కటాక్షవీక్షణములకు ముక్కోటిదేవతలు స్వాధీనులై బ్రతికెదరో ఆ దేవి ఆయన తొడలను అలంకరించినది. అట్టి హయగ్రీవుని నేను శరణు వేడుచున్నాను.

**విశేషములు:-** 1) "శ్రీ మన్మందకటాక్ష లబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరామ్" అను లక్ష్మీ ప్రార్థన యిందు వ్యక్తమగుచున్నది. 2) లక్ష్మీ పరిగ్రహము వలన హయగ్రీవుని సర్వోత్తమత్వము వ్యక్తము. 3) భ=పిక్కలు, గ=మోకాళ్లు, వ=తొడలు అని యిందు చెప్పబడినది.

శ్లో॥ తేజోఽమ్బుదామ్బర విడమ్బి నితమ్బ బిమ్బమ్
హర్యాశయ ద్యుతిభర స్ఫ్రుగుదార నాభిమ్।
యష్టి స్ఫుర న్మణి మయూఖ ధునీ వలీకమ్
లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥ 3

సవ్యాఖ్యా:- తేజః=ద్యుతిః శారదచంద్ర సంబంధీతి భావః, హయగ్రీవస్య శ్వేతదుకూల ధారిత్వా దితి భావః తద్యుక్తః అంబుదః శారదచంద్రద్యుతి ప్రతిఫలిత స్వచ్ఛతరమేఘ ఇత్యర్థః స ఇవ అంబరం=దుకూలం, తద్విడంబతే=అనుకరోతి ధత్తే ఇతి యావత్, తేజోఽంబుదాంబర విడంబి నితంబ బింబః కటిమండలం యస్య తం తేజోంబుదాంబర=విడంబి నితంబ బింబం తథా హరీణాం భేకానాం

ఆశయః=నిలయః జలాశయ ఇత్యర్థః, తస్య ద్యుతిభరం స్పృశతీతి హర్యాశయ ద్యుతిభరస్పృక్ చంద్రకాంత మణిమయ జలాశయతుల్య ఇత్యర్థః. యద్వా హరేః =సర్పస్య, ఆశయే=హృదయే యః ద్యుతిభరః గర్వాతిశయః తం స్పృశతి హరతీతి యావత్ తథోక్తా సర్పతుల్యేత్యర్థః. రోమరాజిరితిభావః తయా ఉదారం, అథవా హరిః సర్పః అతిశయోక్త్యా రోమరాజిః తస్యాశయే గర్భే మధ్యే ఇతి యావత్ యః ద్యుతిభరః=సుషమాతిశయః తం స్పృశతీతి తథోక్తః ఉదారః నాభిః యస్య తం తథోక్తం, యద్వా హరౌ=విష్ణౌ, ఆశయః=చిత్తం యస్య తస్య హర్యాశయస్య విధేః ద్యుతిభరం స్పృశతీతి తత్ స్పృక్ బ్రహ్మతేజ స్సంక్రాన్త ఇత్యర్థః. భగవన్నాభి పద్మనికేతనత్వా ద్విధే రితి భావః, స్వతశ్శ్వేతస్య నాభేః విధికాన్తి సంక్రమణేన అతిశ్వైత్యలాభా దనుగుణా లంకారః అన్యత్తుల్యమ్, తథా యష్టి స్ఫురన్మణి మయూఖధునీ వళీకమ్, యష్టయః=హారా, యష్టిర్దండే హారభేదే ఇతి రత్నమాలా, తత్ర స్ఫురతాం మణీనాం మయూఖానాం=అంశూనాం ధున్యః=లహర్యః వళీషు= భంగీత్రయే యస్య తం తథోక్తం. శేషాద్విభాషేతి బహువ్రీహేః కః, వళీనాం స్ఫుటతరత్వేన తదన్తః కాంతినదీనాం ప్రసారః సులభ ఇతి భావః

**ప్రతిపదార్థము:-** తేజః=శరచ్చంద్రకాంతి గల, అంబుద=మేఘమువంటి, అంబర= తెల్లని పట్టువస్త్రమును, విడంబి=ధరించునట్టి, నితంబబింబమ్=నితంబ (పిఱుదులు) మండలము కలవాడును, హర్యాశయ=జలాశయము యొక్క (చూ॥ విశేషములు) ద్యుతిభర=కాంతిని, స్పృగ్=పొందునట్టి, ఉదారనాభిమ్=విశాల నాభిగలవాడును, యష్టి=హారములందు, స్ఫురత్=మెఱయుచున్న, మయూఖ ధునీ=కిరణప్రవాహములు గల, వళీకమ్=ముడతలు గలవాడును అగు, లక్ష్మీ హయాననమ్=లక్ష్మీయుక్తుడయిన హయగ్రీవుని, అహమ్=నేను, శరణమ్= శరణ్యునిగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** శారద చంద్రకాంతితో తళతళలాడుచున్న శ్వేత దుకూలము ధరించిన వాడు హయగ్రీవుడు. ఆయన నాభి జలాశయమువలె విశాలమయి లోతుగా నున్నది. (చూ॥ విశేషములు) హారకాంతులు పొట్ట మీది "3" ముడతలలో నదుల వలె ప్రవహించుచున్నవి. అట్టి లక్ష్మీహయగ్రీవుని నేను శరణు వేడుచున్నాను.

విశేషములు:- 1) హరి=కప్పలు, హర్యాశయము=చెఱువు. చంద్రకాంతి మణిమయ మయిన జలాశయము వంటిది 'హయగ్రీవనాభి'. 2) హరి=సర్పము, హర్యాశయము =సర్ప హృదయము దాని లోని ద్యుతి=గర్వమును, స్పృక్=తాకు అనగా జయించు రోమరాజితో అందమయిన నాభిగలవాడు - అనగా పాము వలె అందమయిన 'నూగాఱు' గలవాడు. 3) హరి=సర్పము అనగా అతిశయోక్తిచే రోమరాజి. దానియందు అందమంతయు పొందిన 'నాభి' గలవాడు. 4) హరి=విష్ణువు, హర్యాశయ=విష్ణువునందు చిత్తము గల బ్రహ్మ యొక్క ద్యుతి భర=తేజస్సును పొందిన 'నాభి' గలవాడు. 5) హయగ్రీవుని శ్వేతనాభికి బ్రహ్మకాంతి వలన మఱింత అందము సంక్రమించినది. 6) ఇందులో, తే=నితంబము, హ=నాభి, య=వళులు (పొట్ట ముడతలు) వర్ణింపబడినది, 7) భగవంతుని నాభి అంతరిక్షము. దాని నుంచి అంతరిక్షము సృష్టి అయినది. ఆ నాభి స్థానమునకు ఈ శ్లోకమున "హ" ప్రతినిధిగా వచ్చినది. "హం" ఆకాశ బీజము గదా! కనుక 'హకారము నాభి' యగుట శాస్త్ర సమ్మతము.

శ్లో॥ గ్రీవాలమంశురస భాస దురోజభాగమ్
వాచావిదూర రుచి వత్స విశాల వత్సమ్।
యక్షేశ రత్న సజుగుప్స సురత్న కణ్ఠమ్
లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥ 4

సవ్యాఖ్యా:- గ్రీవాయాం=కంఠే, అలం=భూషణాని మాన్త మవ్యయం తేషాం అంశురసేన=కిరణపూరేణ భాసన్ ఉరోజభాగః=స్తనదేశః యస్య తం గ్రీవాలమం శురసభాస దురోజభాగం, కంఠాభరణరుచిః స్తనయోః ప్రసరతీత్యర్థః. వాచా విదూరా=వాచామగోచరా వాచేతి ఆబన్తః రుచిః యస్యాస్సా వాచావిదూర రుచిః శ్రీరితి యావత్ తస్యా వత్స ఇవ వాచావిదూరరుచివత్సః శ్రీవత్సలాంఛన మితి యావత్ తద్యుక్తం విశాలం వత్సం వక్షః యస్య తం వాచావిదూరరుచివత్స విశాలవత్సం యద్వా నామైకదేశే నామగ్రహణాత్ వత్స ఇత్యనేనైవ శ్రీవత్సార్థలాభః తస్య వాచావిదూర రుచిరితి విశేషణమ్ యక్షేశ రత్న సజుగుప్స సురత్నకంఠం, యక్షేశస్య=కుబేరస్య నిధిపతే రితి భావః. రత్నేషు సజుగుప్సం సఘృణం స్వాపేక్షయా తేషాం న్యూనత్వా దితి భావః. చేతన ధర్మస్య ఘృణాయాః అచేతనే

రత్నే ఆరోపః, యథాహ శ్రీహర్షః :- అధారి పద్మేషు యదంఘ్రిణా ఘృణా ఇతి, రత్నం=కౌస్తుభ నామకం కంఠే యస్య తం తథోక్తమ్.

ప్రతిపదార్థము:- గ్రీవా=మెడకు ఉన్న, అలమ్=అలంకారములయొక్క అంశు రస=కిరణ ప్రవాహము చేత, భాసత్=ప్రకాశించుచున్న, ఉరోజభాగమ్= వక్షోజ భాగము కలవాడును, వాచావిదూర=మాటలకు అందని, రుచి=కాంతిగల, వత్స=శ్రీవత్సము, అను పుట్టుమచ్చతోనున్న, విశాలవత్సమ్=విశాల వక్షఃస్థలము గలవాడును, యక్షేశ=కుబేరుని యొక్క రత్న=రత్నములపైన, సజుగుప్స=తక్కువ భావము కల, సురత్న= కౌస్తుభమణి, కంఠమ్=కంఠమునందు గలవాడును అగు, లక్ష్మీహయాననమ్=లక్ష్మీ యుక్త హయగ్రీవుని, అహమ్=నేను, శరణమ్= శరణ్యునిగా, ప్రపద్యే=పొందెదను.

తాత్పర్యము:- మెడలోదాల్చిన రత్నహారముల కాంతులు వక్షఃస్థలముపై తారాడు చున్నవి. అతిసుందరమయిన శ్రీవత్సలాంఛనముతో రమణీయమయిన విశాల మయిన తెల్లని వక్షఃస్థలము, కుబేరునివద్ద నున్న సకల రత్నములను తృణీకరింప గల అద్భుతమయిన కౌస్తుభముతో వెలుగు కంఠముగల లక్ష్మీహయగ్రీవుని నేను శరణు వేడుచున్నాను.

విశేషములు:-1) ఇందు గ్రీ=స్తనప్రదేశముగా, వా=వక్షస్స్థలముగా, య= కంఠముగా వర్ణింపబడినవి.

శ్లో॥ విశ్వ ప్రపఞ్చ రుగుదఞ్చన చుఞ్చుబాహుమ్
'ష్ణ' ప్రత్యుపేత 'కృ' పదార్థ రుగర్థ చక్రమ్।
వేదాన్త సద్రసజ హస్తగ హంస శఙ్ఖమ్
లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥ 5

సవ్యాఖ్యా:- విశ్వప్రపంచ రుగుదంచన చుంచుబాహుం, విశ్వస్య=సర్వస్య ప్రపంచస్య రుచాం ఉదంచనేన=ఉల్లాసనేన విత్తాః ఉదంచన చుంచవః బాహవః చత్వారః యస్య తం తథోక్తమ్, యద్బాహు రక్షిత స్సర్వోఽపి ప్రపంచః శోభావాన్భవతి తమిత్యర్థః 'తేన విత్త ఇతి చుంచుప్ప్రత్యయః' యద్వా. యద్బాహవః కేయూర వలయాదిభిః సర్వమపి ప్రపంచం భాసయంతి తమిత్యర్థః, అథవా

రుక్ ప్రీతిః తథాచ యద్బాహవః సర్వస్యాపి ప్రపంచస్య స్వేషు ప్రీతిం జనయన్తి సుందరత్వా దితి భావః తథా 'ష్ణ' ప్రత్యుపేత కృపదార్థరుగర్థ చక్రం, ష్ణేవ=ష్ణపదేన ప్రత్యుపేతం పశ్చాద్ధృతం 'కృ' ఇతి పదం కృష్ణశబ్ద ఇతి యావత్ తస్య అర్థః అభిధేయభూతం అగ్నిరిత్యర్థః సఇవరుగర్థం రుక్=తేజ ఏవ అర్థః ధనం యస్య తత్ చక్రం సుదర్శనం యస్య తం తథోక్తం. వహ్న్యుజ్జ్వల సుదర్శనధారిణ మిత్యర్థః, వేదాన్తసద్రసజ హస్తగ హంసశంఖం, వేదాన్తేషు ఉపనిషత్సు సవర్తమానః రసః శాన్తరసః జలం చ తత్ర జాయత ఇతి తజ్జః కమలమితిచ తాదృశం హస్తం గచ్ఛతి ప్రాప్నోతీతి హస్తగఃహంసః=పక్షివిశేషః స ఇవ శంఖః యస్య తం తథోక్తం. ఉపనిషత్కాసారగత శాంతరస జలజాత హస్తకమలగత హంసాయమాన శంఖమిత్యర్థః. అనేన వేదాన్త వేద్యత్వం భగవతో గమ్యతే.

**ప్రతిపదార్థము:-** విశ్వ=సమస్తమయిన, ప్రపంచ=ప్రపంచముయొక్క, రుక్= కాంతుల యొక్క (చూ॥ విశేషములు), ఉదంచన=పెంచుటతో, చుంచు=కూడిన, బాహుమ్='4' చేతులు గలవాడును, 'ష్ణ'='ష్ణ' అను అక్షరము చేత, ప్రత్యుపేత= అవతలవైపు కలిసిన, 'కృ'='కృ' అను, పద='కృష్ణ' అను పదము యొక్క, అర్థ= అర్థమయిన 'అగ్ని' (కృష్ణ వర్త్మ అనగా అగ్ని), రుగర్థ=కాంతియే ధనముగాగల, చక్రమ్='సుదర్శన చక్రము' ధరించినవాడును, వేదాంత=ఉపనిషత్తులందు, సత్=ఉన్న, రస=రసము నందు లేదా నీటియందు, జ=పుట్టిన కమలమయిన, హస్తగ=చేతియందు చేరిన, హంస=పక్షివలెనున్న, శంఖమ్=శంఖము-పాంచ జన్యము-గలవాడును అగు, లక్ష్మీహయాననమ్=లక్ష్మీయుక్త హయగ్రీవుని, అహమ్=నేను, శరణమ్=శరణ్యునిగా, ప్రపద్యే=పొందెదను.

**తాత్పర్యము:-** అయన బాహువులు సర్వప్రపంచమును శోభావంతముగా జేయును. ఆయన రక్షణలో ప్రపంచము ఆనందించును. ఆయన చేతియందు అగ్నివర్ణమయిన సుదర్శన చక్రము కలదు. మఱొక చేతియందు 'పాంచజన్య శంఖము' కలదు. శంఖము 'హంస' వలెనున్నది. శంఖమును ధరించినచేయి శాంతరస సరోవరములో మొలచిన పద్మము వలెనున్నది. ఆ శాంతరస సరోవరము ఉపనిషత్తులే. అనగా ఉపనిషత్తులలో వర్ణితమయిన 'శంతమ' మయిన హస్తమును ఆశ్రయించిన పరమ హంసవలె ఆ శంఖము కనబడు చున్నది. అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:**- 1) విశ్వప్రపంచరుగుదంచన - ఇందులో కవి గారు మఱికొన్ని అర్థములు చెప్పిరి. ఎ) కేయూర వలయాదుల కాంతిలో ప్రపంచమును ప్రకాశింప జేయునవి. బి) రుక్ అనగా ప్రీతి - కాగా సర్వప్రపంచమునకు తమయందు ప్రీతిని కలిగించికొనునవి. 2) 'ఉపనిషత్తులు' అను సరోవరమునగల శాంత రసమున పుట్టిన కమలమే హయగ్రీవుని హస్తము. దానిని ఆశ్రయించిన హంస - శంఖము. దీనివలన భగవంతుడు వేదాంతవేద్యుడు అని వ్యంగ్యము. 3) ఈ శ్లోకమున, వి=బాహువులు, ష్ణ=ఒకచేతిలోని చక్రము, వే=మఱొక చేతిలోని శంఖము వర్ణింపబడినవి.

**శ్లో॥ మధ్వాది దైత్య రుధిరాప్తి లసద్గదేతమ్**
**హ్యంతర్ముఖావన సకఙ్కణ కఞ్జహస్తమ్।**
**మేధా సుధామ్బుధిజ ఫేన విశోభనోష్ఠమ్**
**లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥ 6**

**సవ్యాఖ్యా:**- మధుః ఆదిః యేషాం తేషాం మధ్వాదీనాం దైత్యానాం కైటభాదీనాం రాక్షసానాం సంబంధినః రుధిరస్య ఆప్త్యా=ప్రాప్త్యాహేతునా, లసంత్యా= అతిశయేన స్ఫురంత్యా, గదయా=కౌమోదక్యా, ఇతం ప్రాప్తం సేవిత మితి యావత్, అరాతిగణ శోణిత కర్దమిత గదాధారిణ మిత్యర్థః, మధ్వాదిదైత్య రుధిరాప్తలసద్గదేతమ్, తథా హిః ప్రసిద్ధౌ అన్తర్ముఖావన సకంకణ కంజహస్తం, అన్తర్ముఖాః=ప్రత్యఙ్నిష్ఠాః హృదయే భగవంతం ధ్యాయంతో వా తేషాం అవనే=రక్షణే విషయే సకంకణం ధృతకంకణం కంజమివ హస్తః యస్య తం తథోక్తమ్. అన్తర్ముఖానహమవామీతి ధృతదీక్షాబంధ ఇవ సమణివలయః తస్య హస్తః భాతీతి భావః. శంఖచక్రగదా ధారి హస్తత్రయం ఏకస్తు అభయదానోద్యత ఇతి తత్త్వం. మేధాసుధాంబుధిజఫేన విశోభనోష్ఠం, మేధైవ సుధా తస్యా అంబుధౌ భగవద్రూపే ఇతి భావః. జేన=జాతేన, ఫేనేన= డిండీరేణ, విశోభనః=విశేషేణ శుభః, ఓష్ఠః=అధరః యస్య తం తథోక్తమ్.

**ప్రతిపదార్థము:**- మధ్వాది=మధువు మొదలగు, దైత్య=రాక్షసులయొక్క, రుధిరాప్తి= నెత్తురు అంటుటచేత, లసత్=మెఱయుచున్న, గదేతమ్=గదగలవాడును (కౌమోదకి), హి=అట్లే, అంతర్ముఖ=లోచూపుతో తనను ధ్యానించు భక్తుల యొక్క,

అవన=రక్షణమునందు, సకంకణ=కంకణము ధరించిన, కంజహస్తమ్=హస్త కమలము గలవాడును, మేధాసుధాంబుధి=మేధా అను అమృత సముద్రమయిన భగవంతుని యందు (తనయందు), జ=పుట్టిన, ఫేన=నురుగుచే, విశోభన =శోభించునట్టి, ఓష్ఠమ్=పెదవిగల, లక్ష్మీహయాననమ్=లక్ష్మీహయగ్రీవుని, అహమ్=నేను, శరణమ్=శరణ్యునిగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** మధువు మొదలగు 'సృష్టి' విరోధులయిన రాక్షసులను సంహరించుటచే నెత్తురంటిన గద ఒక చేత గలదు. అంతర్ముఖులయిన భక్తులను రక్షించుటకు కంకణబద్ధమయిన చేయి అనగా అభయ హస్తము ఒకవైపు గలదు. భగవంతుడు మేధాశక్తి సముద్రము. ఆయన నోటియందలి తెల్లని 'నురుగు' ఆ సముద్రమున బుట్టిన మేధా విలాసమే. అట్టి నురుగు ఆయన ఓష్ఠమునందు గలదు. అట్టి లక్ష్మీ హయగ్రీవుని శరణు వేడుచున్నాను.

**విశేషములు:-** 1) ఈ శ్లోకమున గదాహస్తమును మకారముతో, అభయ హస్తమును 'హ్యాం' అను మంత్రవర్ణముతో, అధరోష్ఠమును 'మే' అను మంత్రాక్షరముతో చెప్పినాడు. 2) అంతర్ముఖులయి ఆత్మనిష్ఠులయిన వారిని తప్పక రక్షించెదను-అని అభయహస్తము దీక్షాకంకణము కట్టుకొన్నట్లుగా అభయహస్తమునకు కంకణము కలదని ఉత్ప్రేక్ష వ్యంగ్యము.

శ్లో|| ధాంతర్వన స్ఫురిత కున్ద విభేద దన్తమ్
ప్రస్ఫీత వాగమృత కీర్తిపటీ రసాలమ్।
జ్ఞాంతర్వనీ సురభిత శ్రుతిలోల నాసమ్
లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే|| 7

సవ్యాఖ్యా:- ధాన్తర్వనస్ఫురితకుంద విభేదదన్తం, ధా=బుద్ధిః గ్రహణధారణ క్షమా ప్రజ్ఞేతి యావత్ సైవ స్త్రీ తస్యా, అన్తర్వనే=ఉద్యానవనే, స్ఫురితాః వికసితాః కుందా ఇవ మాఘ్యకుసుమానీవ స్థితాః, విభేదాః అభేదాః ఏకాకారేణ ప్రతీయ మానా ఇత్యర్థః రంధ్రరాహిత్యాదితిభావః దన్తాః యస్య తం తథోక్తమ్, ప్రస్ఫీతవాగమృత కీర్తి పటీరసాలం, ప్రస్ఫీతస్య=సమృద్ధస్య వాగమృతస్య సంబంధినీ కీర్తిపటీవ యశః పతాకేవ, రసాలా=జిహ్వా యస్య తం తథోక్తమ్. రసాలా మార్జికా దూర్వా జిహ్వా ఇతి రత్నమాలా. భగవద్వదన సదనస్య అనితర

సాధారణస్య వాగమృతస్య సార్వభౌమాయితస్య కీర్తిపతాకేవ తజ్జిహ్వా భాతీత్యర్థ, జ్ఞాంతర్వనీసురభిత శ్రుతిలోలనాసం, జానన్తీతి జ్ఞాః విద్వాంసః తేషాం అన్తః =మన ఏవ వనీ=అల్పవనం సురభితా యాభిస్తాభిః శ్రుతిభిః నిశ్వాస రూపాదిభిః లోలా=చంచలా నాసా యస్య తం తథోక్తమ్ అనేన శ్రుతీనాం పుష్పత్వం గమ్యతే.

**ప్రతిపదార్థము:-** ధా='బుద్ధి' అను స్త్రీ యొక్క అంతర్వన=ఉద్యానవనమునందు, స్ఫురిత=వికసించిన, కుంద=మొల్లపూల వలెనున్న, విభేద=సందులు లేని, దన్తమ్ =పలువరుసగలవాడును, ప్రస్ఫీత=సమృద్ధమయిన, వాగమృత=అమృతమువంటి వాక్కుల యొక్క కీర్తిపటీ=కీర్తి పతాకవలె నున్న, రసాలమ్='నాలుక' గలవాడును, జ్ఞ=పండితుల యొక్క అంతర్వనీ='మనస్సు' అను తోటను, సురభిత=పరిమళింప జేసిన, శ్రుతి=వేదములచేత, లోల=చంచలమయిన, నాసమ్='ముక్కు'గలవాడును అగు, లక్ష్మీహయాననమ్=లక్ష్మీహయగ్రీవుని, అహమ్=నేను, శరణమ్= శరణ్యునిగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** హయగ్రీవుని దంతములు ప్రజ్ఞాదేవి గారి ఉద్యానవనములో పూచిన మొల్లలవలె నున్నవి. ఆయన నాలుక ఆ స్వామి వాక్యామృతము యొక్క కీర్తి పతాక వలె కదలుచున్నది.

జ్ఞానుల మనస్సులను పరిమళింపజేసిన వేదవాక్య వాసనలచే నాసిక చలించుచున్నది. అట్టి లక్ష్మీహయగ్రీవుని శరణు వేడుచున్నాను.

**విశేషములు:-** 1) ఈ శ్లోకమున దంతములను 'ధా' అను మంత్రవర్ణముతో, జిహ్వను 'ప్ర' అను మంత్రాక్షరముతో, నాసికను 'జ్ఞాం' అను మంత్రవర్ణముతో వర్ణించెను. 2) ధా అనగా 'ధాఞ్' ధాతువుపై 'క్విప్'. ధాఞ్ ధాతువునకు 'ధారణము' అని అర్థము. కాగా గ్రహణధారణ సమర్థమయిన ప్రజ్ఞ. 3) కుందములు అనగా మాఘమాసమున పూయునట్టి 'మొల్లలు' అను తెల్లని పుష్పములు. 'మల్లెలు' కావు. 4) రసాల=నాలుక. (అందుకు నిఘంటువు) 'రసాలా మార్జికా దూర్వా జిహ్వా' - రత్నమాలా నిఘంటువు. 5) హయగ్రీవుని వాగమృతము వాఙ్మయమునకే చక్రవర్తి వంటిది. కనుక 'జిహ్వా' ఆ చక్రవర్తికి 'పతాక' వంటిది. 6) భక్తుల మనస్సులను పరిమళింపజేసినవి శ్రుతులు - అనగా శ్రుతులు 'పుష్పములు' అని వ్యంగ్యము.

శ్లో॥ ప్రజ్ఞాన సిన్ధు కచరాప్త దరశ్రుతీన్ద్రమ్
యజ్ఞాశనావనచణారుణ నేత్రయుగ్మమ్।
ఛద్మాతిగామృతమయూఖ విశాల ఫాలమ్
లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥ 8

సవ్యాఖ్యా:- ప్రజ్ఞాన సింధు కచరాప్త దరశ్రుతీంద్రం, ప్రజ్ఞాన సింధుః=చైతన్య సాగరఃజ్ఞాన ఘన ఇతి యావత్, కచరాప్తదరశ్రుతిః కచరేణ=జలచరేణ మకరేణేతి యావత్ కుండలాయితేనేతి భావః. ఆప్తే=ప్రాప్తే దరౌ శంఖావివ శ్రుతీ శ్రోత్రే యస్య తం తథోక్తమ్, ఇంద్రః=పరమేశ్వరః త్రయాణాం విశేషణసమాసః తం తథోక్తమ్, అత్ర సింధౌ ప్రళయసాగరే కచరేణ=మత్స్యావతారేణ ఆప్తా=ఆనీతాః దరశ్రుతయః=సోమకాసురాత్ భీతియుక్తాః వేదాః తాసాం ఇంద్రం ఈశ్వరం శ్రుతిపరిబృఢం శ్రుతిరక్షకం చేతి భావః ఇతి ప్రతీయతే. యజ్ఞాశనావనచణారుణ పద్మనేత్రం, యజ్ఞాశనానాం=దేవానాం ఇంద్రాదీనాం అవనేన=రక్షణేన విత్తే= అవనచణే తేన విత్త ఇతి చణప్, అరుణే=మహాపురుషత్వా ద్రక్తరేఖాశాలినీ పద్మే ఇవ నేత్రే యస్య తం తథోక్తమ్. అరుణేత్యనేన హయగ్రీవస్య నేత్రే మనాగ్రక్తే సతి దేవద్రోహిణః రాక్షసా భీతాః పలాయన్త ఇతి ధ్వన్యతే, అత ఏవ దేవరక్షాచణతా ప్రోక్తా సంగచ్ఛతే, ఛద్మాతిగామృతమయూఖ విశాలఫాలం, ఛద్మాతిగః నిష్కపటః నిష్కళంక ఇతి యావత్, అమృత మయూఖః=చంద్రః, స ఇవ విశాలం ఫాలం= లలాటస్థలం యస్య తం తథోక్తమ్, కళంకేతు చంద్ర స్సంకుచిత ఇవ వర్తతే. అతో న తస్య హయగ్రీవవదనౌపమ్యం ఘటత ఇతి కృత్వా ఛద్మాతిగేత్యుక్తమ్.

ప్రతిపదార్థము:- ప్రజ్ఞాన సింధు=చైతన్యసముద్రుడును, కచర=జలచరమయిన మకరము చేత, ఆప్త=కుండలాకారముతో పొందబడిన, దర=శంఖములవంటి, శ్రుతి=చెవులు గలవాడును, ఇంద్రమ్=సర్వేశ్వరుడును, యజ్ఞాశన=దేవతల యొక్క, అవనచణ=రక్షణ సమర్థమయిన, అరుణ=ఎఱ్ఱని, నేత్రయుగ్మమ్= నేత్రద్వయము గలవాడును, ఛద్మాతిగ=కళంకరహితమయిన, అమృతమయూఖ =చంద్రునివలె, విశాల=విశాలమయిన, ఫాలమ్='నుదురు' గలవాడును అగు, లక్ష్మీహయాననమ్=లక్ష్మీహయగ్రీవుని, అహమ్=నేను, శరణమ్=శరణ్యునిగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** భగవంతుడు చైతన్య సాగరము. అందలి మకరములవలె చెవులకు కుండలములు గలవు. ఆ చెవులు శంఖములవలె కలవు. ఆయన నేత్రములు ఎర్రజీరలుగా నున్నవి. ఆ నేత్రములే దేవతారక్షకములు. ఆయన నుదురు కళంక రహితుడైన చంద్రుని వలె తెల్లగా విశాలముగా నున్నది. అట్టి లక్ష్మీహయగ్రీవుని నేను శరణు గోరుచున్నాను.

**విశేషములు:-** 1) కచరాప్త దరశ్రుతీంద్ర-ఇందులో కచరుడు అనగా సోమ కాసురునిచే అపహరింపబడి భయ (దర) పడిన వేదములకు రక్షకుడు అను అర్థమున్ను వ్యంగ్యము.

2) మహా పురుషుల నేత్రములు అరుణరేఖలతో అలరారుట సాముద్రిక లక్షణము.

3) రాక్షసులను చూచి కోపముతో కొంచెము ఎర్రబడిన 'కళ్లు' అనియు చెప్పవచ్చును. ఆ కళ్లను చూచి రాక్షసులు భయపడి పారిపోయినందువలననే దేవతలు రక్షింపబడిరి అనియు భావము.

4) మామూలు చంద్రునిలో కళంకముండుట వలన హయగ్రీవముఖముతో పోలికకు పనికిరాదు అని వ్యంగ్యము. నిష్కలంకమయిన హయగ్రీవముఖము చంద్రుని కన్న అధికమని వ్యతిరేకాలంకారము వ్యంగ్యము.

5) ఇందు ప్ర=చెవులు, య=నేత్రద్వయము, ఛ=విశాలమైన నుదురు వర్ణింప బడినవి.

శ్లో॥ స్వాధీన పద్మ మధుమత్త విశేషకాళిమ్
హార్ద స్ఫుర ద్భృగణ కైతవ రత్న కూటమ్।
ఓంకార పఞ్జర విహార హరి ప్రకాశమ్
లక్ష్మీహయానన మహం శరణం ప్రపద్యే॥ 9

సవ్యాఖ్య:- స్వాధీనే=చంద్రమేఘాది ప్రయుక్తసంకోచాద్య భావాదాత్మాధీన వికాసే ఇత్యర్థః, చక్రహంసాది స్వామ్యంతరా భావా దాత్మాధీన ఇతివా పూర్వార్థే స్వపదం పద్మవాచి ఇదానీన్తు భృంగవాచీతి వివేకః, పద్మే వర్తమానేన మధునా=మకరందేన తత్పానేనేతి భావః. హేతునా మత్తః విశేషకం=చిత్రకంతదివ అళిః=భ్రమరం యస్య తం స్వాధీనపద్మమిదం తన్మధుమత్తో ద్విరేఫశ్చాయ మిత్యర్థః. అత్ర ముఖ సౌందర్యయో రుపమేయయో రగ్రహణే పద్మమధునో రుపమానయో గ్రహణా

దతిశయోక్తిః, అళిరివ విశేషక మిత్యనుక్త్వా వైపరీత్య నిర్దేశాత్ప్రతీపమ్. హార్దేన స్నేహేన హయగ్రీవస్య చంద్రమండల గతత్వాత్ నక్షత్రాణాం చ చంద్రప్రియత్వా దితి భావః. స్ఫురతో భగణస్య నక్షత్రపూగస్య కైతవేన మిషేణ రత్నకూటః మణికిరీటం యస్య తం తథోక్తమ్, భగవతి స్నేహేన సన్నిహితః తారాగణ ఇవ కూటో భాతీత్యర్థః అత్ర రత్నకూటకైతవేన భగణో భాతీత్యనుక్త్వా వైపరీత్య నిర్దేశాత్ ప్రతీపభేదః యద్వా హార్ద స్ఫురన్భగణః కైతవరత్న కూటః మిథ్యా కిరీటం యస్య తం అస్య కిరీట ప్రథా మిథ్యేవ కింతు తాత్కాలిక చంద్రబింబమేవేదం అథవా సుమేరుశిఖరమేవేదం కథ మన్యథా అస్మిన్ సానురాగం భగణః స్ఫురేదితి భావ. మేరుశిఖరచారిత్వాద్భానాం తత్ర హార్దమితి జ్ఞేయం, మణిగణస్థానే భగణ నిర్దేశాత్ అతిశయోక్తిశ్చ వ్యజ్యతే, తథా ఓంకారే ఏవ పంజరే విహారో యస్య తం అతఏవ హరి ర్విష్ణుః కీరశ్చ ఇతి ప్రకాశః ప్రథా యస్య తం ఓంకార పంజరవిహారహరి ప్రకాశః ఏవం విధ లక్ష్మీ హయానన మహం శరణం ప్రపద్యే.

**ప్రతిపదార్థము:-** స్వాధీన=తనకు అధీనమయిన, పద్మ=ముఖపద్మముయొక్క మధు=సౌందర్యమకరందముచే, మత్త=మదించిన, విశేషక=తిలకము వంటి, అళి=తుమ్మెదగలవాడును, హార్ద=హృదయపూర్వక స్నేహముచేత, స్ఫురత్= మెఱయుచున్న, భగణ=నక్షత్రసమూహముయొక్క కైతవ=వ్యాజము చేత, రత్నకూటమ్=రత్న కిరీటము గలవాడును, ఓంకార=ఓంకారమను, పంజర= పంజరమునందు, విహార= విహారము గలవాడు కనుకనే, హరి=చిలుక, విష్ణువు -అను, ప్రకాశమ్=కీర్తి గలవాడునుఅగు, లక్ష్మీహయాననమ్=లక్ష్మీ యుక్తుడయిన హయగ్రీవుని, అహమ్= నేను, శరణమ్=శరణ్యునిగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** తనకధీనమై నిత్యము వికసించు పద్మమునందు నిరంతర మకరంద పానముచే మదించిన తుమ్మెద గలవాడును అనగా నిత్యవికాసమయిన ముఖము నందు నిరంతర ప్రకాశమానమయిన కస్తూరీ తిలకము గలవాడును, చంద్ర మండల గతుడైనందున, చుట్టు స్నేహముగా క్రమ్మిన నక్షత్రములే కిరీటముగా ఏర్పడిన వాడును, ఓంకార పదము నందుండుటచే, ఓంకారము చేపట్టిన వారికి దొరకువాడగుటచే, హరి='చిలుక, విష్ణువు, అను కీర్తి గలవాడును అగు లక్ష్మీహయగ్రీవునికి శాశ్వతముగా శరణాగతుడను అని భావము.

విశేషములు:-

1) ఈ శ్లోకమున హయగ్రీవుని కస్తూరీ తిలకమును 'స్వా' అను మంత్రవర్ణముతో, ఆయన రత్నకిరీటమును 'హా' అను మంత్రబీజముతో, చివఱగా ఆయన యొక్క ఓంకార లభ్యమయిన 'చిలుక' వంటి విష్ణుస్వరూపమును 'ఓం' అను ప్రణవముతో వర్ణించెను.

2) ప్రణవముతో మొదలయిన యీ స్తుతి ప్రణవముతో ముగిసినది. ఈ 'ఓంకార' కర్తరి వలన హయగ్రీవుడు ఓంకార పంజరశుకమయిన విష్ణుస్వరూపుడనియు, హయగ్రీవ మంత్రమున్ను ఓంకారార్థ పర్యవసాయి యనియు వ్యంగ్యము.

3) స్వాధీన అనగా భగవంతునకు అధీనమయిన-ఒక అర్థము. ఆయన ముఖముపై ఇతరులకు అధికారము లేదు. కనుక స్వాధీనము అని అర్థము.

4) స్వ-అనగా తనకు అనగా తుమ్మెదకు అని మఱొక అర్థము. ఆ శ్లోకపాదములో 'అళిం' ఉన్నది కనుక. ఈ తుమ్మెదకు ఈ పద్మము సొంతము. అది దానినుండి వెళ్ళవలసిన అవసరము లేదు. దాని మకరందపానమునకు మఱొక తుమ్మెద రాదు. సూర్యునకు అధికారము లేదు. చంద్రునితో సంకోచము లేదు. ఇంతకును, ఈ తుమ్మెద స్వామివారు ధరించిన 'కస్తూరీ' తిలకమే. 'కస్తూరి' నలుపు కనుక తిలకము తుమ్మెదగా చెప్పబడినది.

5) ముఖమునకు బదులు 'పద్మము', సౌందర్యమునకు బదులు 'మధువు' అని చెప్పుటవలన అతిశయోక్తి. దీనికి తోడుగా 'బొట్టు వంటి తుమ్మెద' అని చెప్పుటవలన 'ప్రతీపము', 'తుమ్మెద వంటి బొట్టు' అని ఉపమకు బదులు ప్రతీపము పై అతిశయోక్తికి అవసరము.

6) నక్షత్రములవంకతో రత్నకిరీటము ప్రకాశించుట 'కైతవ ప్రతీపము'. నిజమునకు 'రత్న కిరీటము' వలె నక్షత్రములు ప్రకాశించుచున్నవి. కనుక రత్న కిరీటము ఉపమానము, నక్షత్రములు - ఉపమేయము. ఈ క్రమము ఇచ్చట తిరుగబడినది. రత్న కిరీటమే ఉపమేయము, నక్షత్రములే ఉపమానముగా ఏర్పడినది. కైతవ శబ్ద ప్రయోగము వలన 'కైతవ ప్రతీపము' అయినది.

7) లేదా నక్షత్రగణమే 'మాయాకిరీటము' గా గలవాడు అని అర్థము. అనగా చంద్రబింబమే ఇది. కనుకనే దీనియందు అనురాగముతో నక్షత్రములు చుట్టు

చేరి మెఱయుచున్నవి. కాగా కిరీటము=చంద్రబింబము. అందలి మణులు= నక్షత్రములు ఇందులో విషయమును చెప్పక విషయిని మాత్రమే చెప్పుట వలన అనగా 'నక్షత్రములనే' చెప్పుటవలన రూపకాతిశయోక్తి.

'బెల్లంకొండ' రామరాయకవికృతులలో

# హయగ్రీవనవరత్నస్తుతి

అనునది శాలివాహన శకమున 1825-క్రోధి
నిజజ్యేష్ఠ శుద్ధ 14న వ్రాయబడినది.

శ్రీః






**విద్యామూర్తి మఖణ్డ చన్ద్రవలయ శ్వేతారవిన్దస్థితమ్**
**హృద్యాభం స్ఫటికాద్రినిర్మలతనుం విద్యోతమానం శ్రియా।**
**వామ్కాస్థిత వల్లభాం ప్రతి సదా వ్యాఖ్యాన్త మామ్నాయ వా-**
**గర్థా నాదిమపూరుషం హయముఖం ధ్యాయామి హంసాత్మకమ్॥**

శ్రీః

# శ్రీ సాలగ్రామ నృసింహాష్టకమ్

సవ్యాఖ్యానమ్

శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితమ్

గండకీవ్యాఖ్యా

(ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్లో॥ సాలగ్రామ నృసింహమ్
తత్త్వం నారాయణత్వ మాత్మీయమ్।
లోకం ప్రతి బోధయితుమ్,
కృష్ణాతోయే భజే విరాజంతమ్॥ 1

రామరాయటీక:- 'నారాయణత్వమ్=జలమయత్వమ్'

ప్రతిపదార్థము:- నారాయణత్వమ్=నారాయణుడగుటఅను, ఆత్మీయమ్=తనదయిన, తత్త్వమ్=తత్త్వమును, లోకంప్రతి=లోకమును గూర్చి, బోధయితుమ్=బోధించుటకు, కృష్ణాతోయే=కృష్ణానదీజలమునందు, విరాజంతమ్=వెలుగుచున్న సాలగ్రామ=సాలగ్రామ రూపమయిన, నృసింహమ్=నరసింహుని, భజే=సేవించెదను.

తాత్పర్యము:- తన నారాయణతత్వమును లోకమునకు బోధించుటకా అన్నట్లు కృష్ణానదిలోనున్న నరసింహసాలగ్రామమూర్తిని సేవించెదను.

విశేషములు:- 1) నోరుతెఱచినట్లుగానుండే సాలగ్రామము నరసింహ సాలగ్రామము. తెఱచిన నోరు 'ఱంపము' వలె నుండును. అది సింహదంత పంక్తితో సమానము. 2) నారాయణుడు అనగా '2' అర్థములు. (ఎ) నర సమూహమునందు అంతర్యామిగా ఉండువాడు, (బి)నారం=అనగా జలము. ఆ జలమునందుండువాడు అని అర్థములు. సాలగ్రామనరసింహుడు 'కృష్ణాజలము'లో నుండి 'తన' నారాయణత్వమును (2) గా సూచించుచున్నాడు అని కవి చమత్కారము. ఇది ఫలోత్ప్రేక్ష.

శ్లో॥ సాలగ్రామ నృసింహమ్
కృష్ణాతోయేఽమ్బుజే రసం సంతమ్
ఔత్సుక్యా దశ్రాంతమ్
వందే నిత్యం ద్విరేఫవ ద్యంతమ్॥ 2

రామరాయటీక:- యంతం-పిబంతం-నిత్యం-వందే.

ప్రతిపదార్థము:- కృష్ణాతోయే=కృష్ణనీరు అను, అంబుజే=కమలమునందు, సంతమ్=ఉన్న, రసమ్=రసమును, మధురిమను, అశ్రాంతమ్=నిరంతరము, ఔత్సుక్యాత్=కుతూహలమువలన, ద్విరేఫవత్=తుమ్మెదవలె, యంతమ్=పొందు చున్న, సాలగ్రామ=సాలగ్రామరూపమయిన, నృసింహమ్=నరసింహుని, నిత్యమ్ =ఎల్లప్పుడును, వందే=నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము:-** కృష్ణ నీరు అను కమలమునందు ఉన్న మకరందమును నిత్యము త్రాగుచున్న 'తుమ్మెద' వలె నున్న నరసింహ సాలగ్రామమునకు నమస్కరించెదను.

**విశేషములు:-** 1) సాలగ్రామము నలుపు కనుక 'తుమ్మెద' తో పోల్చబడినది. 2) కృష్ణానీరమును కమలముగా పోల్చుట విలక్షణము. 3) నీటిలోని మాధుర్యము మకరందముతో అభిన్నముగా చెప్పబడినది. 4) లేదా, అంబుజము నందున్న రసమును తుమ్మెదవలె, కృష్ణాతోయమునందలి మాధుర్యమును అస్వాదించుచున్నాడు.

శ్లో॥ సాలగ్రామ నృసింహమ్
గర్భీకృత చక్రమండలం నీలమ్।
కృష్ణాతటినీ లోలమ్
వందేఽహం భక్త భూతికృ ల్లీలమ్॥ 3

ప్రతిపదార్థము:- గర్భీకృత=గర్భభాగముగా చేయబడిన, చక్రమండలమ్=చక్ర వృత్తముకలదియు, నీలమ్=నల్లనిదియు, కృష్ణాతటినీ=కృష్ణానదియందు, లోలమ్ =ఆసక్తి గలదియు/ఓలలాడునదియు, భక్త=భక్తులకు, భూతి=ఐశ్వర్యమును, కృత్= చేయు, లీలమ్=విలాసముగలదియును అగు, సాలగ్రామనృసింహమ్=నృసింహ సాలగ్రామమును, అహమ్=నేను, వందే=నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము:-** గర్భమున చక్రవృత్తము ధరించినదై కృష్ణలో ఓలలాడుచున్న నరసింహ సాలగ్రామము భక్తులకు ఐశ్వర్య ప్రదాయకము. అట్టి నరసింహునకు నమస్కారము.

**విశేషములు:-** 1) సాలగ్రామములకు మధ్యలో అడ్డుగా రంధ్రముండును. ఆ రంధ్రములో చక్రమువంటి చిహ్నముండును. దానిని బట్టియే అది సాలగ్రామమని గుర్తించెదరు. ఇట్టి చిహ్నములు బంగారు వన్నెతోనుండును. ఆ బంగారమును కొందఱు గీకి అపహరించెదరు. అందువలన బంగారములేని సాలగ్రామములే దొఱకుచుండును.

శ్లో॥ సాలగ్రామ నృసింహమ్
నీలాండం సర్వలోకసంభూతమ్।
క్షౌమాయమాణ కృష్ణా
కల్లోలౌఘం భజే నిరస్తాఘమ్॥ 4

**రామరాయటీక:-** 'నీలాండం యథా హిరణ్మయాండః ప్రాగాసీత్ తథా అద్య అయం నీలాండః ఇతి భావః'

**ప్రతిపదార్థము:-** సర్వలోక=సమస్తలోకములకు, సంభూతమ్=ఉత్పత్తిస్థానమయిన వాడును, నీలాండమ్=నల్లని అండమువంటి(ది) వాడును, క్షౌమాయమాణ=పట్టు వస్త్రమువలెనున్న, కృష్ణా=కృష్ణానది యొక్క, కల్లోలౌఘమ్=తరంగ సమూహము గలవాడును, నిరస్త=పోగొట్టబడిన, అఘమ్=పాపములుగలవాడునుఅగు, సాలగ్రామ నృసింహమ్=సాలగ్రామరూప నృసింహుని, భజే=సేవించెదను.

**తాత్పర్యము:-** సర్వలోక సంభవమునకు కారణమయిన 'నల్లని గ్రుడ్డు' వలె నున్న యీ నరసింహ సాలగ్రామము చుట్టునున్న కృష్ణానదీ శుభ్ర తరంగ పరంపర పట్టువస్త్రమువలె నున్నది. పాపహరుడైన యా నరసింహ సాలగ్రామ మూర్తికి నమస్కారము.

**విశేషములు:-** 1) సృష్టికి ముందు సృష్టి కర్త తేజస్సు హిరణ్మయమయిన అండముగా మాఱెనని పురాణ వాక్యము. 'అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్, తదండ మభవత్ హైమం సహస్రాంశు సమప్రభమ్', ఆ విధముగా

ప్రపంచమునకు పూర్వము బంగారు గ్రుడ్డు కారణము కాగా నేడు ఈ నల్లగ్రుడ్డు అనగా గుండ్రటి సాలగ్రామము ప్రపంచకారణమయినది. అనగా భగవంతుడు ప్రపంచ కారణము గనుక 'నల్లని గ్రుడ్డు' గా వర్ణింపబడెను. 2) ఱింగులు వారునట్లు కట్టిన 'పట్టుధోవతి' అలలు అలలుగానున్న నదివలె నుండును. కనుక 'కృష్ణానది' నరహరి కట్టిన పట్టు వస్త్రమువలె నున్నదని కవి వర్ణన. శ్రీహరి 'పీతాంబరధారి' కదా!

శ్లో॥ సాలగ్రామ నృసింహమ్
కృష్ణాక్షీరాహితాద్రిభి న్నీలమ్।
నీలీకృతాఖిలాపం
వందే నిర్ధూత భక్త సంతాపమ్॥ 5

**రామరాయటీక:-** కృష్ణాయాః క్షీరే-జలే-పయసిచ-కేనచిత్ ఆహితం- అద్రిభి న్నీలం-ఇంద్రనీలమణిమ్-క్షీరమధ్యే-క్షిపంతి హీంద్రనీలమణిమ్ పరీక్షార్థమ్. అపాం సమూహః ఆపం-సూ॥ ఋక్పూరబ్ధూః-సమాసాంత ప్రత్యయో వా.

**ప్రతిపదార్థము:-** కృష్ణా=కృష్ణానదియొక్క, క్షీర='నీరు' అనబడు పాలయందు, ఆహిత=ఉంచబడిన, అద్రిభిన్నీలమ్=ఇంద్రనీలమణివంటివాడును, నీలీకృత= నీలవర్ణముగా జేయబడిన, అఖిలాపమ్=సమస్త కృష్ణా జలము కలవాడును, నిర్ధూత=పోగొట్టబడిన, భక్త=భక్తులయొక్క, సంతాపమ్=సంతాపము గలవాడును అగు, సాలగ్రామ నృసింహమ్=నృసింహ సాలగ్రామమూర్తిని, వందే= నమస్కరించెదను.

**తాత్పర్యము:-** కృష్ణానదీ జలము అనే పాలయందు ఉంచిన నీలమణి వంటివాడు, కనుకనే జలమునంతటిని 'నీలము' గా మార్చినవాడును, భక్తసంతాపమును పోగొట్టువాడును అగు శ్రీ నరహరి సాలగ్రామ మూర్తికి నమస్కరించెదను.

**విశేషములు:-**

1) ఇంద్రనీలము నాణ్యమయినదో లేదో తేల్చుటకు దానిని పాలలో వేసెదరు. పాలు నీలవర్ణముగా కనబడినచో ఇంద్రనీలము శ్రేష్ఠమయినదని అర్థము. సాలగ్రామము అనే ఇంద్రనీలము శ్రేష్ఠమయినది కనుక కృష్ణాజలము

నీలమయినది అని అర్థము. 2) సాలగ్రామము నలుపు. శ్రీహరి నలుపు. అందువలన ఇంద్ర నీలముతో పోలిక చెప్పబడినది.

శ్లో॥ సాలగ్రామ నృసింహమ్
భక్తాపద్దంతి మాలికా సింహమ్।
కృష్ణాలింగిత దేహమ్
వందే నిర్వాణదాయకం సోఽహమ్॥ 6

రామరాయటీక:- సః తాపత్రయపీడితః ఇత్యర్థః.

ప్రతిపదార్థము:- భక్త=భక్తులయొక్క, ఆపద్దంతి మాలికా=ఆపదలనే ఏనుగులకు, సింహమ్=సింహమయినవాడును, కృష్ణా=కృష్ణానదిచే, ఆలింగిత=కౌగిలించికొనబడిన, దేహమ్=శరీరముగలవాడును, నిర్వాణదాయకమ్=మోక్షప్రదాతయు అగు, సాలగ్రామనృసింహమ్=నృసింహ సాలగ్రామమూర్తిని, వందే=నమస్కరించెదను, సః=ఆ సాలగ్రామరూప నరసింహుడు, అహమ్=నేనే.

తాత్పర్యము:- భక్తుల ఆపదలు ఏనుగులంతవి అయితే వాని పాలిట సింహమీ నరసింహుడు. ఆయన ముక్తిదాయకుడు. కృష్ణానదిలో తన్మయుడుగానున్న ఆ నరసింహదేవుని నేను 'సోఽహం' అను భావనతో పూజించెదను.

విశేషములు:- 1) "దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవః సనాతనః, త్యజేదజ్ఞాన నిర్మాల్యమ్ 'సోహం' భావేన పూజయేత్" అని అద్వైత పూజా భావన యీ శ్లోకమున చెప్పబడినది. 2) 'పరమాత్మయే నేను' అను భావనయే పూజ. ఈ జ్ఞానమే భక్తి. ఇది అద్వైతము. 3) విశిష్టాద్వైతమున జీవుడు భగవంతుని శరీరము. 'శరీరము- శరీరి' అభిన్నముగా నుండెదరు. కనుక జీవుడు దేవుడు అభిన్నము. ఆ విధముగా 'సోహం' భావము గలదు.

శ్లో॥ సాలగ్రామ నృసింహమ్
కృష్ణాతోయాక్షితారకాదేహమ్।
మోక్షశ్రీ మణి గేహమ్
వందే నిర్ధూత భక్త సమ్మోహమ్॥ 7

రామరాయటీక:- కృష్ణాతోయమేవ అక్షి నేత్ర గోళకమ్-తత్ర తారకా కనీనికా-తద్దేహమ్-తద్రూపమ్.

ప్రతిపదార్థము:- కృష్ణాతోయ='కృష్ణనీరు' అనే, అక్షి=కంటిలో, తారకా=నల్లగ్రుడ్డు వంటి, దేహమ్=శరీరము గలవాడును, మోక్షశ్రీ=మోక్షలక్ష్మియొక్క మణిగేహమ్= రత్నభవనము అయిన వాడును, నిర్ధూత=పోగొట్టబడిన, భక్త=భక్తులయొక్క సమ్మోహమ్=అజ్ఞానముగలవాడును అగు, సాలగ్రామనృసింహమ్=సాలగ్రామ నరసింహమూర్తిని, వందే=నమస్కరించికొందును.

**తాత్పర్యము:-** శుభ్రమయిన కృష్ణాజలములో నున్న 'నరసింహ సాలగ్రామము' 'తెల్లని కంటిలో నల్లగ్రుడ్డు' వలె నున్నది. మోక్ష లక్ష్మికి మణి భవనము వంటివాడు అయిన భక్త మోహహరుడయిన ఆ నరసింహునికి నమస్కరించెదను.

**విశేషములు:-**

1) ఉపనిషత్తులందు 'అక్షి పురుషోపాసన' గలదు. అనగా కంటిలో మనకు కనబడు చైతన్య కళయే 'ప్రత్యగాత్మ'. అయనను 'సోహం' భావముతో ఉపాసనచేయుట 'అక్షి పురుషోపాసన' అందురు. 2) కృష్ణాజలములో నున్న 'సాలగ్రామము' నేత్రములోని నల్లగ్రుడ్డువలె నున్నది. సాలగ్రామాధిష్ఠాన పురుషుడు అక్షి పురుషుడని వ్యంగ్యము. అట్టి అక్షి పురుషుడే మోక్ష లక్ష్మికి నిలయము. అయనతో అభేదజ్ఞానమే మోక్షము గదా! దీనితో 'జీవుడు వేఱు బ్రహ్మము వేఱు' అను మోహము నశించును. ఇట్లు ఈ శ్లోకమున విశేషణములు సాకాంక్షముగానున్నవి.

**శ్లో॥** సాలగ్రామ నృసింహమ్
స్వాంభః పాతృ ప్రదత్త శ వ్యూహమ్।
నాశిత భక్తాపోహమ్
వందే లక్ష్మీకళత్ర మద్ధాహమ్॥ 8

**రామరాయటీక:-** శవ్యూహమ్-సుఖ సమృద్ధిం-అద్ధా-సాక్షాత్.

ప్రతిపదార్థము:- స్వ=తనకు సంబంధించిన, అంభః=నీటిని, పాతృ=త్రాగువారికి, ప్రదత్త=ఇవ్వబడిన, శవ్యూహమ్=మంగళసమూహము గలవాడును, నాశిత= పోగొట్టబడిన, భక్త=భక్తులయొక్క, అపోహమ్=పొరపాట్లు గలవాడను, లక్ష్మీ కళత్రమ్='లక్ష్మీ' భార్యగాగలవాడును అగు, సాలగ్రామనృసింహమ్=నరసింహ సాలగ్రామమూర్తిని, అహమ్=నేను, అద్ధా=సాక్షాత్తుగా, వందే=నమస్కరించెదను.

**తాత్పర్యము:-** నరసింహుడు నివసించిన కృష్ణాజలమునుగాని, నరసింహ సాలగ్రామమును అభిషేకించిన జలమునుగాని తీర్థముగా స్వీకరించినవారికి ఆయన శుభములు గలిగించును. భక్తుల బాధలను పోగొట్టును. అట్టి లక్ష్మీనారసింహ సాలగ్రామమును నేను నమస్కరించెదను.

**విశేషములు:-** 1) సాలగ్రామోదకము సర్వపాపహరమని సంప్రదాయము చూ॥ "సాలగ్రామ శిలావారి పాపహారి విశేషతః అజన్మకృత పాపానాం ప్రాయశ్చిత్తం దినే దినే, అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం సర్వ పాపక్షయకరం విష్ణు పాదోదకం పిబ" 2) ప్రార్థన చివఱ స్వామిని 'లక్ష్మీయుక్తుని' గా పూర్ణరూప ధ్యానము చేసినాడు.

ఇది

## శ్రీ బెల్లంకొండ రామరాయ కవికృత

## సాలగ్రామ నృసింహాష్టకము

## శ్రీః

శ్రీః

# శ్రీ వేదాద్రి యోగానంద నృసింహాష్టకమ్

శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితమ్

'ప్రహ్లాదినీ' వ్యాఖ్య

(ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

## మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్లో॥ వేదౌఘస్య ధరాత్మనా స్థితవతః కృష్ణా తటిన్యా స్తటే
మూర్ధానం చరణారవిందనఖరైః సూర్యై రివోద్దీపయన్।
వేదాంతస్థితి మాత్మనః ప్రకటయన్ స్వాభావికీం భాససే
యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥ 1

ప్రతిపదార్థము :- కృష్ణాతటిన్యాః=కృష్ణానది యొక్క, తటే=తీరమునందు, ధరాత్మనా=పర్వతస్వరూపముతో, స్థితవతః=నిలిచియున్న, వేదౌఘస్య=వేద సమూహము యొక్క, మూర్ధానమ్=శిరస్సును/శిఖరమును, చరణారవింద =పాదాంబుజముల యొక్క, నఖరైః=గోళ్ల చేత, సూర్యైరివ=సూర్యులచేతవలె, ఉద్దీపయన్=ప్రకాశింపజేయుచు, ఆత్మనః=నీ యొక్క, స్వాభావికీమ్=సహజ మయిన, వేదాంత స్థితిమ్=వేదశిరస్సులందలి స్థితిని, ప్రకటయన్=సూచించుచు, భాససే=వెలుగొందుచున్నావు, యోగానన్ద=యోగజన్యమయిన ఆనంద స్వరూపుడ వైన, నృసింహ=నరసింహా!,తావక=నీ, పదాంభోజాత=పాదాంబుజములందలి, భక్తిమ్=భాక్తిని, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** వేదాద్రియందున్న నరసింహస్వామికి ఇది వర్ణన. వేదములే భూమి యందు పర్వతరూపము దాల్చినవి. అదే వేదాద్రి. వేదవేద్యుడు భగవంతుడు. అందునను 'ఉపనిషత్తులు' ఆయనకు నివాసస్థానములు. ఉపనిషత్తులు వేదశిరస్సులు వంటివి. వేదాద్రి శిఖరమున స్వామి నివాసము. కనుక వేదశిఖరములయిన ఉపనిషత్తులు స్వామి నివాసము అను సహజ విషయమునకు వేదాద్రిక్షేత్రము నిదర్శనమయినది. స్వామి పాదములు

కమలములు. వాని నఖములు సూర్య సమానమయినవి. అవి వేదాద్రిశిఖరమును వెలిగించుచున్నవి. అట్టి వేదవేద్యుడు, ఔపనిషద పురుషుడు అయిన యోగ నారసింహస్వామి భక్తులకు తన పాదభక్తిని ఒసంగవలయునని కవి ప్రార్థన.

**విశేషములు:-** 1) వేదాద్రియందలి నరసింహస్వామి యోగనారసింహుడు. యోగులకు కుంభకకాలమున మణిపూర స్వాధిష్ఠాన చక్రముల ప్రాంతమున పెటిల్లుమని ఉద్భవించు 'అగ్నిజ్వాల' యే 'నరసింహ' స్వరూపమని ఒక 'యోగీశ్వరుని' వివరణ. 'తస్య మధ్యే వహ్నిశిఖా' అను మంత్ర పుష్పమునందు దీనిని గూర్చియే చెప్పబడినది. వెన్నుబద్దయే 'స్తంభము' అనియు సంప్రదాయము. 2) త్రిపురాసురదహనముచేయు 'శివుని' 'నారాయణాస్త్రము' గూడా యోగ నారసింహ స్వరూపము. 3) కృష్ణానది – ఈ పదమునుబట్టి 'యమున' అనగా 'పింగళ' నాడి ధ్వనించును. అది సూర్యనాడి. దాని తీరము 'సుషుమ్న' అను నాడియే. దాని వద్ద నున్న కొండ 'మేరువు' అనబడు వెన్ను. దానియందలి 'సూర్యుని వంటి నఖ కాంతులు' పరమాత్మ యొక్క జ్ఞానాగ్ని పుంజములే. 'నీల తోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా'. 4) భగవన్నఖములను 'చంద్రుని' గా చెప్పుట గలదు. పద్మపురాణమున కృష్ణనఖములను 'కాంతి కళికలు' గా చెప్పిరి. 5) నఖ సూర్యోదయము వలన 'వేదాద్రి' ఉదయాద్రితో పోలుచున్నది. సూర్యులు అని బహువచనము వలన ఉదయాద్రి కన్న 'వేదాద్రి' ఆధిక్యము ధ్వనించు చున్నది. 6) పద పద్మభక్తిని ఇమ్మని ప్రార్థన. అంతకు ముందు 'పదనఖములను' సూర్యులుగా చెప్పుటవలన తన హృదయమున 'కోటిసూర్యులవెలుగు' కావలయునని కోరినట్లు వ్యంగ్యము. తద్వారా తన హృదయమునందలి 'అవిద్యాంధకారము' ఎంతో గట్టిదని సూచన. 7) మనోమయకోశము సర్వ విద్యా స్థానము. 'భక్తి' దానియందే కలుగ వలెను. నరసింహ పాదాంబుజములు దానియందే నిలువ వలెను. సర్వవిద్యా స్థానమయిన మనస్సు వేదస్థానము గూడా కాగలదు. కనుక 'వేదాద్రి' యందున్న నరసింహపాదములకు తన 'మనస్సు' మరొక వేదాద్రి. దాని శిఖరము అనగా 'విజ్ఞానమయ' కోశము=బుద్ధి. బుద్ధిస్థానములో భగవంతుని తేజస్సు అనగా 'చైతన్యము' వ్యాపింపవలయునని ప్రార్థన. **'బుద్ధిం తు సారథిం విద్ధి'** అను గీతా వాక్యము ప్రకారము నరునకు

హరి 'బుద్ధి స్థానమున సారథిగా నుండుట అభిలషణీయము. 8) అట్టి స్థితిలో వచ్చునది ఆనందమే. మనోమయ విజ్ఞానమయ కోశములు భాగవత్సాన్నిధ్యమున అలరారినచో 'ఆనందమయ కోశము' సార్థకము కాగలదు. ఇదంతయు శారీరక మానసిక యోగముల వలన జరుగునట్టిది కనుకనే ఇది 'యోగానంద నరసింహునకు' సాభిప్రాయ ప్రార్థన.

**శ్లో॥ వేదక్ష్మాధర మూర్ధ భాసుర గుహా మధ్యే నిగూఢం వసన్**
**రక్షోదంతిపతేః హతే రపకృతిః తూష్ణీంభవన్ సౌమ్యధీః॥**
**బ్రహ్మానంద మపార మాంతర మితి ప్రాశ్నాసి మే శాశ్వతీమ్**
**యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥ 2**

**ప్రతిపదార్థము:-** యోగానంద!=యోగానంద స్వరూపుడవయిన, నృసింహ!= నరసింహదేవా!, వేదక్ష్మాధర =వేదాద్రి యొక్క, మూర్ధ=శిఖరమునందు, భాసుర= మెఱయుచున్న, గుహామధ్యే=గుహలోపల, నిగూఢమ్=గుప్తముగా, వసన్= నివసించుచు, రక్షోదంతిపతేః=హిరణ్య కశిపుడు అను రాక్షస గజరాజు యొక్క హతేః='వధ' వలన, అపకృతిః=చేయవలసిన కర్తవ్యములేనివాడై, తూష్ణీంభవన్ =మౌనముగానుండుచు, సౌమ్యధీః=సౌమ్యమయిన బుద్ధిగలవాడై, ఇతి=ఈ విధముగా, అపారమ్=అనంతమయిన, ఆంతరమ్=అంతర్గతమయిన, బ్రహ్మా నందమ్=బ్రహ్మానందమును, ప్రాశ్నాసి=అనుభవించుచున్నావు, శాశ్వతీమ్ =శాశ్వతమయిన, తావక=నీ, పదాంభోజాత=పాదాంబుజము లందలి, భక్తిమ్= భక్తిని, మే=నాకు, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** 'హిరణ్యకశిపుడు' అనే రాక్షసమత్త గజమును సంహరించుటకు శ్రీ నరసింహావతారము వచ్చినది. హిరణ్యకశిపు సంహారము తరువాత నరసింహు నకు కర్తవ్యము లేకపోయినది. అందువలన ఆయన వేదపర్వత గుహామధ్యమున క్రియారహితుడై, అంతర్ముఖుడై తన అంతర్యామి స్వరూప సందర్శన నిమగ్నుడై బ్రహ్మానందమును అనుభవించుచున్నాడు. అని ఉత్ప్రేక్ష వ్యంగ్యము. అట్టి యోగనారసింహుడు తనకు భక్తి యోగము నిచ్చుగాక! అని రామకవి ప్రార్థన.

**విశేషములు:-** 1) నరసింహావతారము కార్యార్థమయి వచ్చిన క్షణికావతారము. కర్తవ్యానంతరము ఆ అవతారము మఱల తన మూలరూపములో కల్సిపోవును.

ఆ మూల రూపము సర్వవ్యాపి అయిన బ్రహ్మము. ఆ బ్రహ్మము 'వేద శిఖల' యందున్నది. ఈ విషయమునే కవి వేదాద్రి శిఖరములందు గూఢముగా నున్నట్లు చెప్పెను. 2) స్వాధిష్ఠాన మణిపూరములందు జ్వలించిన అగ్ని జ్వాల అజ్ఞాన నాశము చేసిన తరువాత ఆ 'వేదపర్వత శిఖరమున' అనగా 'వెన్ను' అనే పర్వత శిఖరమున గల 'గుహలో' హృదయాకాశములో లీనమయినది. దహరాకాశమే యిచ్చట గుహ. 3) జ్వాలారూప భీకరరూపానంతరము, ప్రశాంత జ్యోతి అయిన ఆ 'పరంజ్యోతి' రూపము నిష్క్రియము, శాంతము. అది ఆనంద స్వరూపము. కనుక ఆయన యోగానందుడు.

**శ్లో॥ హిత్వా క్రూరతరం నిజం సురభర స్యాపి ప్రభీతి ప్రదమ్**
**రూపం సౌమ్యజనావనాయ విదధత్ శాంతం తదేవం విధమ్।**
**ద్రష్టౄణాం చతురర్థదో విజయసే మౌనేన మే శాశ్వతీమ్**
**యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥ 3**

ప్రతిపదార్థము:- యోగానంద=యోగసంబంధమయిన ఆనంద స్వరూపముగల, నృసింహ!=నరసింహా!, సురభరస్యాపి=దేవతా సంఘమునకు గూడ, ప్రభీతి ప్రదమ్=మిక్కిలి భయంకరమైన, క్రూరతరమ్=అత్యంతక్రూరమైన, నిజమ్= నీదయిన, రూపమ్=ప్రచండ స్వరూపమును, హిత్వా=వదలి, సౌమ్యజన=సౌమ్య స్వభావముగల భక్తుల, అవనాయ=రక్షణకొఱకు, తత్=ఆ రూపమును, ఏవం విధమ్=ఇటువంటి, శాంతమ్=శాంతస్వరూపముగా, విదధత్=చేయుచు, మౌనేన=మౌనముతోనే, ద్రష్టౄణామ్=దర్శించువారికి, చతురర్థ='4' పురుషార్థము లను, దః=ఇచ్చువాడవై, విజయసే=వెలుగుచున్నావు, మే=నాకు, శాశ్వతీమ్ =స్థిరమయిన, తావక=నీ, పదాంభోజాత=పాదాంబుజములందలి, భక్తిమ్=భక్తిని, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** హిరణ్యకశిపు సంహారమునకై అవతరించిన ఘోర వీరావతారము నరసింహ స్వరూపము. ఆ స్వరూపమును సమీపించుటకు అటు దేవతలు ఇటు లక్ష్మియు చాలకపోయిరి. అట్టి రూపమును నరసింహుడు భక్తుల కొఱకయి శాంతముగా మార్చికొని యీ వేదాద్రి యందు 'యోగానంద దీపముగా' శాంత జ్యోతియై వెలుగుచుండెను. మౌనముగా తనను దర్శించువారికి 4 పురుషార్థము

లను ఇచ్చుచుండెను. అట్టి భగవంతుడు తనకు భక్తిని దయచేయవలయునని రామ కవీంద్రుని మొఱ.

**విశేషములు:-** 1) నరసింహరూపము తీవ్రక్రోధముతో వచ్చినది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదాది మహాభక్తులను బాధించుటవలన అతనిని దహించుటకు వచ్చిన అగ్నిజ్వాల వంటి ఘోరతర రూపము. కనుక అది 'సురలకు' గూడా భయంకర మయినది. కనుకనే పోతన గారు 'లక్ష్మీదేవి' మాటలలో 'ప్రళయార్క బింబంబు పగిది నున్నది గాని నెమ్మోము పూర్ణేందునిభము కాదు' అని వర్ణించెను. 2) అట్టి రూపము 'ప్రహ్లాదుని' ప్రార్థనతో శాంతించి అతనికి వరములిచ్చి అదృశ్య మయినది. ఈ విషయము మనసులో నుంచికొని 'రామకవి' భక్తులకొఱకు స్వామి వేదాద్రిపై శాంతరూపమును అవలంబించినట్లు వర్ణించిరి. 3) కనుక 'సౌమ్యజన' అనగా 'ప్రహ్లాదుడు' అనియు చెప్పవచ్చును. 4) మఱియు నరసింహ రూపము క్రోధమునుంచి 'శాంతము'గా మాఱినది. అంతేకాని 'సింహ' ముఖము మారలేదు గదా! అనగా భయంకరమయిన అగ్ని జ్వాల 'దీపము' గా మారినట్లు సింహరూపమే 'అక్రూరము'గా మారినది. 5) 'మౌనముగా' అను పదమును, దర్శించువారికి, స్వామివారికి గూడా అన్వయింపవచ్చును. అనగా నిష్కామముగా దర్శించువారికి అకారణముగా '4' పురుషార్థములను ఇచ్చువాడు అని అర్థము. లేదా ఆర్తితో మౌనముగా అర్థించువారికి అడుగకయే కావలసిన '4' అర్థములను ఇచ్చువాడు అనియు అర్థము. 6) తనను దర్శించినవారికి వేఱే కామము లుండవు. వారికి ధర్మమయినను అర్థమయినను, కామమయినను, మోక్ష మయినను భగవంతుడే. కనుక వారికి అనగా మౌనముగా దర్శించువారికి అనగా 'మౌనులకు' తన స్వరూపము అయిన యోగానందమును ఇచ్చువాడు అనియు వ్యంగ్యము. 7) మౌనము అనగా 'ఊరకుండుట'అనగా ఇంద్రియ మనోవ్యాపారములులేని స్థితి. సచ్చిదానందరూప స్థితి. కనుక సచ్చిదానంద రూపస్థితిలో దర్శించువారికి అనగా ఆత్మానుసంధానముచేయు వారికి సచ్చిదానందరూపముగా (మౌనముగా) తన స్వరూపమునే ఇచ్చువాడు యోగా నందుడు. 8) చతురర్థదః – అనగా '4' పురుషార్థములను ఇచ్చువాడు అని ఒక అర్థము. 'చతుః' అనగా '4' పురుషార్థముల యొక్క 'అర్థమయిన'

నిజస్వరూపమును ఇచ్చువాడు అని మఱొక అర్థము. 9) ప్రహ్లాదుడు=అనగా ఆనందస్వరూపుడు అని అర్థము. ఆయనను రక్షించినవాడు నరసింహుడు. ఇర్వురును 'ఆనందులే' ఆనందస్వరూపుడైన జీవుడే ఆనందస్వరూపుడైన భగవంతునే దర్శించెను. దానికి కారణము భక్తి. అట్టి భక్తినే తనకు ఇమ్మని రామకవీంద్రుని శరణాగతి.

శ్లో॥ **గూఢం క్వాపి గుహాతలే నిజపదం దుర్దర్శ మజ్ఞానినామ్**
**మత్వా రూప మిదం బిభర్షి కృపయా జీవేషు లీలావశాత్।**
**దృష్ట్వైవాస్య పలాయతే క్వచన నః తాపత్రయం బ్రహ్మవత్**
**యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥** 4

**ప్రతిపదార్థము:-** యోగానంద=యోగానంద స్వరూపుడైన, నృసింహ=నరసింహ ప్రభూ! క్వాపి=ఎచ్చటనో, గుహాతలే=గుహలోన, గూఢమ్=గుప్తముగానున్న, నిజపదమ్=నీ పాదమును, నీ స్థానమును, అజ్ఞానినామ్=అజ్ఞానము కలవారికి, దుర్దర్శమ్=చూడసాధ్యముకానిదిగా, మత్వా=తలచి, జీవేషు=జీవులందు, కృపయా=దయతో, లీలావశాత్=లీలగా, ఇదమ్=ఈ, రూపమ్=నరసింహ రూపమును, బిభర్షి= ధరించుచున్నావు, అస్య=ఈ అవతారముయొక్క దృష్ట్వైవ= చూపుతోనే, నః=మా, తాపత్రయమ్=సంతాపత్రయము, బ్రహ్మవత్=బ్రహ్మదేవుని వలె, క్వచన=ఎచ్చటికో, పలాయతే=పరుగెత్తును, తావక పదాంభోజాత=నీ పాదపద్మమునందలి, భక్తిమ్=భక్తిని, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** సర్వవ్యాపి అంతర్యామి అయిన భగవంతుని నివాసము, స్వరూపము, ఎంత తమలోనే ఉన్నను అజ్ఞానులకు అందదు. అందువలన ఇట్టి జీవులయందు దయతో లీలా మాత్రముగా ఈ విచిత్ర విలాసరూపమును ధరించితివి. ఈ రూపమును చూచిన చాలును-బ్రహ్మాది దేవతలయినను పరుగెత్తెదరు. అట్టి రూపమును చూచి నా తాపత్రయము బ్రహ్మవలె పారిపోయెను. కనుక నీ భక్తికి అర్హుడను. భక్తిని నాకు అనుగ్రహింపుము. అని రామకవి వాంఛితము.

**విశేషములు:-** 1) 'గుహ' అనగా శరీరములోని దహరాకాశము. వేదములోని ఉపనిషత్తులలోని రహస్యమయిన వర్ణన. ప్రపంచములో దుర్లభమయిన

భగవంతుని స్థానము. అంతర్యామి స్థితి. 2) ఈ అవతారమును చూచి తాపత్రయము పారిపోవును. అనుటవలన తాపత్రయము 'మత్త గజము' అని యూహింపవచ్చును. 3) 'బ్రహ్మ' వలె అనగా నరసింహావతారమును చూచి దేవతలు గూడా భయపడినట్లు వర్ణన. మఱియు ఆ రాక్షసునకు అట్టి వరముల నిచ్చిన అపరాధి 'బ్రహ్మ' కనుక ఆయన భయపడి పరుగెత్తినట్లు చమత్కారము. 4) బ్రహ్మ 'పరబ్రహ్మ' అని చెప్పినచో 'పరబ్రహ్మవలె' ఆనందస్వరూపుడు అని అర్థము వచ్చును. కాని ఆ అర్థము సరికాదు. 'వలె' అనునది కుదరదు. ఆయన 'పరబ్రహ్మ'యే కదా!

**శ్లో॥ సచ్చిన్మోదమయీ తవాకృతి రియం, విజ్ఞానినాం భాసతాం**
**జ్ఞానానందరస ప్రవర్షి ఘనవత్ బాభాస్యతే మాదృశామ్।**
**శృంగారామృత మేతదాశ్రిత మలం పాతుం న మే దృగ్ద్వయమ్**
**యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥ 5**

**ప్రతిపదార్థము:-** యోగానంద=యోగానంద స్వరూపా, నృసింహ!=నరసింహా!, ఇయమ్=ఈ, తవ=నీ, ఆకృతిః=ఆకారము, విజ్ఞానినామ్=జ్ఞానులకు, సచ్చిన్మోద మయీ=సచ్చిదానందమయమయినదిగా, భాసతామ్=తోచుగాక!, మాదృశామ్= మావంటి అజ్ఞానులకు, జ్ఞానానందరస=జ్ఞానానందామృతములను, ప్రవర్షి= కురిపించు, ఘనవత్=మేఘము వలె, బాభాస్యతే=తోచుచున్నది, ఏతదాశ్రితమ్= ఈ రూపమునందు గల, శృంగారామృతమ్=శృంగారసుధను, పాతుమ్= త్రాగుటకు, మే=నా, దృగ్ద్వయమ్=నేత్రద్వయము, న అలమ్=చాలదు, తావక= నీ, పదాంభోజాత=పాదపద్మద్వయము నందు, భక్తిమ్=భక్తిని, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** అద్వైతము ప్రకారము భగవంతుని రూపమే సచ్చిదానంద మయము. అనగా భగవంతుడు జ్ఞానమే ఆనందమే. కాని ద్వైతబుద్ధులయిన మా వంటి సామాన్యులకు మాత్రము నీవు జ్ఞాన, ఆనందములను వర్షించు మేఘమువలె కన్పట్టుచున్నావు. ఈ నీ దివ్యరూపమునందు కనబడు సౌందర్య శృంగారమును తనివితీర చూచుటకు నా రెండు కళ్లు చాలవు. కనుక నృసింహదేవా! నీ పాద భక్తి ప్రసాదింపుము.

**విశేషములు:-** 1) అద్వైతమున భగవంతుడు అనగా జ్ఞానమే. ఆనందమే. ఇతర మతములందు భగవంతుని గుణములు జ్ఞానానందములు. మొదటిది

జ్ఞానుల మతము. రెండవది అజ్ఞానుల మతము అని కవి భావము. ఈ కవివర్యుడు 'శంకరాశంకర భాష్య విమర్శము' అను గ్రంథము రచన చేసినవాడు. అందులో ఈయన అద్వైతమును సమర్థించి విశిష్టాద్వైతము మొదలగు ఇతర మతములను ఖండించెను. 2) మేఘము తన గుణమయిన జలమును వర్షించు నట్లు నరసింహుడు తన గుణములయిన జ్ఞానానందములను వర్షించు మేఘము-అనగా 'ద్వైత'వాద పద్ధతిలో చెప్పినమాట ఇది. 3) మేఘము అనుటకు కారణము హరి 'మేఘ నీలవర్ణుడు' అగుట. 'మాదృశామ్'=మా అనగా, 'మిథ్య' లక్ష్మి అని 2 అర్థములు. ఆ ప్రకారము మాదృశులు అనగా 'మాయా దృష్టి' గలవారికి అని వ్యంగ్యము. 4) అఖండమయిన నరహరి సౌందర్యమును చూచుట కనులకు సాధ్యము కాదు అనునది అంతరార్థము. 'కళ్లుచాలవని' తెలుగు నుడికారము బాహ్యార్థము. దర్శించుశక్తి కలుగుటకు 'భక్తి' కావలయును. భగవంతుని 'భక్తి'తో దర్శింపవలయును. 5) 2 కళ్లకు 2 కాళ్లు చాలు అని వ్యంగ్యము.

శ్లో॥ రూపం తే పరిహాయ దివ్య మమృతం భవ్యం తదేతత్ క్షమే
యాతుం నాహ మథాపి కర్మవశతో యామ్యేవ తే చోదనాత్।
యాచే త్వా మిద మేక మేవ వసతః యత్ర క్వ వా మే పరామ్
యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥ 6

ప్రతిపదార్థము:- యోగానంద!=యోగానందరూపా, నృసింహ!=నరసింహదేవా!, దివ్యమ్=దివ్యమయిన, అమృతమ్=అమృతమయిన, భవ్యమ్=శుభప్రదమయిన, తదేతత్=ఈ, తే=నీ, రూపమ్=రూపమును, పరిహాయ=వదలి, యాతుమ్=పోవుటకు, అహమ్=నేను, నక్షమే=ఓర్వలేను, అథాపి=అయినను, కర్మవశతః=ప్రారబ్ధకర్మమునుబట్టి, తే=నీ, చోదనాత్=ప్రేరణవలన, యామ్యేవ=పోవు చున్నాను, త్వామ్=నిన్ను, ఇదమేకమేవ=ఇది ఒక్కటే, యాచే=కోరుచున్నాను, యత్ర క్వ వా=ఎక్కడనయినను, వసతః=నివసించు, మే=నాకు, పరామ్=అధిక మయిన, తావక=నీ, పదాంభోజాత=పాదాంబుజములందలి, భక్తిమ్=భక్తిని, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** ఓ వేదాద్రి క్షేత్రవాసా నరసింహ ప్రభూ! నీ దివ్యమంగళ విగ్రహమును కనులార చూచుచున్న నేను దీనిని వదలి వెళ్లలేను. అయినను

ప్రారబ్ధవశమున ప్రవర్తించు నీ ఆజ్ఞచేత వెళ్లక తప్పదు. కనుక వెళ్లుచున్నాను. ఈ సందర్భమున నాదొక్క విన్నపము. స్వామీ! నేను ఎచ్చట నున్నను నాకు నీ పట్ల అచంచలమయిన భక్తి యుండునట్లు అనుగ్రహింపుము. అని కవిరాముని శరణాగతి.

**విశేషములు:**-1) వేదాద్రి క్షేత్రదర్శనము తరువాత అచ్చటనుండి బయలు దేఱవలసిన సందర్భములో రామకవి మాట యిది. 2) ప్రారబ్ధము అనుభవింపక తప్పదు. దానిని బట్టి భగవత్ప్రేరణ కలుగును. ఆ ప్రేరణను బట్టి క్షేత్రదర్శన మయినది. ఆ ప్రేరణను బట్టియే క్షేత్రము నుండి స్వగ్రామమునకు వెళ్లక తప్పదు. నివాసగ్రామము గూడా ప్రారబ్ధఫలమే కదా! 3) క్షేత్రమును వదలుట తన తప్పు కాదు. కనుక భక్తి లోపము కాదు. క్షేత్రము నుండి పంపుట భగవంతుని తప్పు కాదు. కనుక అనుగ్రహ లోపము కాదు. కేవలము 'కర్మ' ఫలము. 4) విగ్రహసన్నిధి ముఖ్యము కాదు. మానసిక సన్నిధి ముఖ్యమని సూచన.

**శ్లో॥** దారాపత్య ధనాది దుర్దమ ఝష గ్రాహాది సత్వాకులే
కామ క్రోధ తరంగ సంకుల మహామోహాఖ్య పాథోమయే।
సంసారే మమ మజ్జతో జలనిధౌ తాపాగ్నిభీతే తరిం
యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥ 7

**ప్రతిపదార్థము:**- యోగానంద=యోగానందరూపుడవయిన, నృసింహ!= నరసింహా!, దారాపత్యధనాది=భార్య, బిడ్డలు, ధనము మొదలైనవి, దుర్దమ= అణచరాని, ఝష= చేపలు, గ్రాహాది=మొసళ్లు మొ॥గా గల, సత్వ=జంతువులచే, ఆకులే=వ్యాకుల మయినదియు, కామక్రోధ=కామ, క్రోధము అనెడు, తరంగ =అలలచే, సంకుల= క్రిక్కిరిసిన, మహామోహాఖ్య='మహామోహము' అను పేరు గల, పాథోమయే= నీరుగలదియు, తాపాగ్నిభీ=తాపత్రయము అను 'బడబాగ్ని భయము'తో, ఇతే= పొందబడిన, సంసారే=సంసారమను, జలనిధౌ= సముద్రము నందు, మజ్జతః=మునిగి పోవుచున్న, మమ=నాకు, తరిమ్='పడవ' అయిన, తావక=నీ, పదాంభోజాత=పాద పద్మములందలి, భక్తిమ్=భక్తిని, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:**- వేదాద్రి నరసింహా! నేను సంసార సముద్రములో మునిగి యున్నాను. భార్య, పిల్లలు అనే మొసళ్లు, కామ క్రోధములు అనే తరంగములు,

మహా మోహము అను నీరు, తాపత్రయము అను బడబాగ్ని యీ సంసార సముద్రమున నన్ను బాధించుచున్నవి. నీయందలి భక్తియే నాకు 'పడవ' గావున ఆ 'భక్తి' శాశ్వత మగునట్లు నన్ను దీవింపుము అని కవి రాముని కాంక్ష.

శ్లో॥ బ్రహ్మాండే పతనాదిదోషకలుషే స్వర్గాదిలోకే క్వ వా
నాహం స్థాతు మిహోత్సహే తవ పదం భవ్యం విదోషం స్వయమ్।
ఆరోఢుం పర ముత్సహే కరుణయా నిశ్శ్రేణికాం మే పరాం
యోగానంద నృసింహ! తావక పదాంభోజాత భక్తిం దిశ॥ 8

ప్రతిపదార్థము:- యోగానంద=యోగానందరూపుడైన, నృసింహ!=నరసింహ స్వామీ, బ్రహ్మాండే=బ్రహ్మాండమునందు, పతనాది=పడిపోవుట మొదలగు, దోష=దోషములచే కలుషే=మలినమయిన, స్వర్గాదిలోకే=స్వర్గము మొదలగు లోకములందు, క్వవా=ఎక్కడయినను, ఇహ=ఈ భూలోకమందయినను, స్థాతుమ్=ఉండుటకు, అహమ్ =నేను, నోత్సహే=ఉత్సాహపడను, పరమ్=కాని, విదోషమ్=నిర్దోషమయిన, భవ్యమ్ =మంగళమయిన, తవ=నీ, పదమ్= లోకమును, స్వయమ్=సాక్షాత్తుగా, ఆరోఢుమ్=ఎక్కుటకు, ఉత్సహే=ఉత్సాహ పడుచున్నాను, పరామ్=గొప్పదయిన, నిశ్శ్రేణికామ్= నిచ్చెన అయిన, తావక=నీ, పదాంభోజాత=పాదాంబుజము లందలి, భక్తిమ్=భక్తిని, కరుణయా=దయతో, దిశ=ఇమ్ము.

**తాత్పర్యము:-** స్వామీ! యోగానందస్వరూపా! వేదాద్రి నరసింహా! ఈ బ్రహ్మాండమున సకల లోకములు శాశ్వతములు కావు. స్వర్గమయినను పుణ్యము ఉన్నంత వఱకు ఉండును. పుణ్యము అయిపోయిన తరువాత స్వర్గము నుంచి జాఱిపడవలసినదే. ఈ భూలోకమయినను ఇంతే. కనుక ఇట్టి దోషములు లేని దివ్య భవ్యమయిన నీ పరంధామమును చేరవలయునని అభిలాషపడుచున్నాను. ఆ సమున్నతలోకమును చేఱుటకు 'నిచ్చెన' నీ భక్తియే. స్వామీ! ఆ భక్తిని నాకు అనుగ్రహింపుము.

**విశేషములు:-** 1) ఇది ఒక జ్ఞాని చేసిన 'మొఱ'. దీనియందు సంసారవాంఛలు లేవు. అట్లని ప్రత్యక్షముగా మోక్షమును కోరుటలేదు. కేవలము మోక్షకారణ మయిన 'భగవద్భక్తి' నే కోరుచున్నాడు. కారణము **'దదామి బుద్ధి యోగం తం**

**యేన మా మనుయాంతి తే'** అను వచనమును బట్టి 'భక్తి' కయినను భగవంతుడే కారణము కనుక ఆ భక్తినిమ్మని అయననే కోరుట. 2) రహస్యమేమనగా మోక్షము ఒకరు ఇచ్చునది కాదు. పుచ్చుకొనునది కాదు. అది ఒక వస్తువు కాదు. జ్ఞానమే దానికి కారణము. జ్ఞానమునకు చిత్తశుద్ధి కావలయును. అందుకు భగవ త్ప్రసాదము కావలయును. కనుక 'భక్తి' నిమ్మని కోరుట. 3) 'భక్తి' అనునది అద్వైతుల దృష్టిలో జ్ఞానమే. 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ' రామకవి 'అద్వైతి' కనుక ఈ భక్తి జ్ఞానమే. అదియును 'సోఽహం' అను ఆత్మాభేద జ్ఞానమే.

- - -

ఇది

శ్రీ బెల్లంకొండ రామరాయకవి కృతులలో

# శ్రీ వేదాద్రి యోగానందనృసింహాష్టకము

శ్రీః

This book containing five minor works of
**SRI BELLAMKONDA RAMARAYA KAVI**
with TELUGU commentary,
by
**Sri Mellachervu Venkata Subrahmanya Sastri**
*Lecturer, Dept. of Sanskrit,*
*Sri Gorantla Venkanna Oriental College, Thimmasamudram,*
is placed at the lotus feet of
**SRI VEDADRI LAKSHMINRUSIMHA SWAMY,**
and published with the financial assistance of
**Miss Ravi Lavanya, Chirala.**

66

"ADVAITAMRUTAM" and

"VEDANTA NISCHAYAH" of

SRI BELLAMKONDA RAMARAYA KAVI (1875-191

will be brought out in book form

with Telugu translation by

Sri MELLACHERVU VENKATA SUBRAHMANYA SASTRI,

*Lecturer,*

Sri Gorantla Venkanna Oriental College,

Timmasamudram.

